Dear Sri Malakondayya,

I would like to tell you how greatly I liked your book ''Jeevitha Valayalu''. That you are not only a very able and dynamic administrator but also a fine poet came to me as a pleasant surprise. Your diction is simple and sweet, and there is a natural spontaneity in your lines. What is more important, your whole work glows with sincerity of feeling.

If only you care to persist, you will make a name as one of our leading poets.

V.R. NARLA,
Editor, Andhra Jyoti.

# అనుభవ కేదారంలో

ఔను....

జీవితం ఎప్పుడూ ప్రవాహంలా సాగిపోదు. ఒక్కొక్క మాటు వలయాలుగా చుట్టుకుంటుంది, సుడులు సుడులుగా తిరుగుతుంటుంది.

ఒక్కొక్కప్పుడు వెదకబోతూఉంటే కాలికి తగిలే పూలతీగ జీవితం.

ఒక్కొక్కప్పుడు పొంచి పొంచి కాటువేసే కాలనాగు జీవితం.

అసలు మనిషి జీవించేది జీవితం కోసం.

జీవితం ఎందుకున్నది? మనిషిని జీవింపచేయడానికి.

జీవితానికీ, మనిషికీ జరిగే నిరంతర సంఘట్టనంలో పుట్టిన చెకుముకి రవ్వలే, మిత్రులు మాలకొండయ్య గారి ఈ స్వచ్ఛంద కవితలు.

మాలకొండయ్య గారి కవిత్వానికి అనుభవం పునాది, అనుభూతులు గోడలు, ఆత్మవిమర్శనం గోపురం. పెండింగ్ ఫైళ్ళు, ఇంటర్వ్యూలు, దొరగారి దర్శనం—ఇందుకు మచ్చుతునకలు.

మాలకొండయ్యగారి కవితా రచనకు నిరుపహతి స్థలం అక్ఖర్లేదు. రమణీ ప్రియదూతిక తెచ్చి ఇచ్చే కప్పూర విడెంతో నిమిత్తం లేదు. కారు ప్రయాణంలోనూ, విమానయానం లోనూ ఆయనకు కవితావేశం కట్టలు తెంచుకొని ప్రవహిస్తుంది. అలాగే ఫలానా వస్తువే కవితావస్తువు కాగలుగుతుందనే ఇరుకు ఇజాలూ ఆయనకు లేవు. నవ్వు, కోపం, సిగ్గు, ప్రేమ, అరువుకళ్ళు, ఆరు

గురు మిత్రులు, ఇటుక, చెప్పు-అన్నీ అతణ్ణి పలికించే కవితావస్తువులే. ఆయన ఏది రాసినా అనుభవకేదారంలో పండించిందే. ఆయన ఏది గానంచేసినా అనుభూతి తంత్రులు స్పందించిందే. మొదటి కవితలోనే ఆయన ఇలా అంటాడు—

''చూసేవన్నీ, చేసేవన్నీ
తనివితీర చెప్పాలని—
మనసులోని ఆలోచనలను
ఆవేదనలను
ముసుగు విప్పి
కలం కుంచె రంగులతో
కథలుగా, కవితలుగా
కాలం గుండెల్లో వెదజల్లాలని—''

మాలకొండయ్యగారు వృత్తి రీత్యా కలెక్టరు. ప్రవృత్తి రీత్యా రకరకాల అనుభవాల మధుకణాలను సేకరించే కలెక్టరు (మధు వ్రతుడు). ''బాధితులను చూసి నవ్వితే అది నవ్వుకాదు నాగుపాము, అది పువ్వుకాదు పులికోర'' అన్నప్పుడు మాల కొండయ్య గారి భావ తీవ్రత స్పష్టంగా కనిపిస్తుంది.

"జీవితం ఒక ప్రవాహం
సుఖ దుఃఖాలు దాని రెండు తీరాలు
ఒకే ఒడ్డును ఒరుసుకొని
ఏ జీవితమూ ప్రవహించలేదు'' అన్నప్పుడు ఈ కవి తాత్త్విక దృక్పథం తరళాయమానంగా మెరుస్తుంది. చెప్పదలచుకున్నది నీళ్ళు నమలకుండా చెప్పేతీర్పు మాలకొండయ్యగారికి ఉన్నది. అందుకు తీసిపోని కూర్పూఉన్నది. ముందు ముందు ఈ కూర్పు నేర్పు (గ్రధనకౌశలం) ముక్కాకలు తీరాలని ఆశిస్తున్నాను.

డా॥ సి. నారాయణరెడ్డి

# ఆవిష్కారం

"My heart bleeds when I see human suffering" అంటున్నా రెవరో !

ఎవరబ్బా, ఆ అంటున్నది?

మానవ యాతనను చూచినప్పుడు హృదయం కన్నీరు కార్చే కరుణాళువులు ఈ కాలంలో కూడ ఉన్నారా?

"పేదవాళ్ల ఫైళ్లు
పెండింగుగానే ఉంటాయి—"

ఓహో, ఆ అంటున్నది మాలకొండయ్యగారు!

ఒక్క అధికార వర్గంలోనే కాదు, లబ్ధ ప్రతిష్ఠులైన రచయితలలో కూడ అంత సనాతనమైన విషయాన్ని అంత అధునాతనంగా చెప్పగల తెలుగు కవి పుంగవులెవరు?

అవును. శ్రీ లింగం మాలకొండయ్యగారు మొదటినుంచీ గొప్ప విద్యార్థి, పుట్టుకతోనే గొప్ప మేధావి, ప్రస్తుతం ప్రజలచే సర్వకళాపోషక బిరుదనామంతో వ్యవహరించబడుతున్న గొప్ప అధికారి.

ఆయనకు కాకపోతే— "పెండింగు ఫైళ్లు" వంటి రచనను, అందులో "పేదవాళ్ల ఫైళ్లు పెండింగుగానే ఉంటాయి" అనే సత్యాన్ని వ్యక్తీభూతం చెయ్యడం మరెవరికి సాధ్యం?

అయితే—

గొప్ప విద్యార్థులు, గొప్ప మేధావులు, గొప్ప అధికారులు ఈ నాడే కాదు, ఏ నాడూ కూడ చాలమందే ఉంటారు. ఉండకపోతే—శిలాయుగం నుంచి అణుయుగం దాకా కానిబలిజం (Canibalism) నుంచి హ్యూమనిజం (Humanism) దాకా ఈ మానవ ప్రగతి ఎలా సాధ్యపడుతుంది?

అందులోనూ- ఆ విధమైన ఉన్నతశ్రేణి నాయకులలో సహృదయత, రసజ్ఞత, కళాపోషకత లేకపోతే, జరిగిన ఈ ప్రగతి చరిత్ర మనవరకు ఎలా వచ్చి ఉండేది?

మరొక చిత్ర మేమిటంటే-అట్టి సహృదయ రసజ్ఞ కళాపోషకులైన నాయకులు స్వయంగా కళాస్రష్టలై ఉండిన కాలాలలోనే సుస్థిరమైన మానవాభ్యుదయం జరిగింది. అట్టి అభ్యుదయ చరిత్ర వివిధసాహిత్యరూపాలలో మానవజాతికి అందగలిగింది.

ఈ నాడు తెలుగుజాతికి చరిత్ర ఉన్నదంటే — అందుకు కారణం ఈ మన మాలకొండయ్యగారి వంటి సాహితీ సారస్వత వరప్రసాద సిద్ధ చిత్తులైన రాజులు, మంత్రులు, సేనాధిపతులు, వణిక్ప్రముఖులూ మాత్రమే కాదా?

ఒక్క రాజరాజనరేంద్రుడు రసహృదయుడు కాకపోతే, ఒక్క వీరారెడ్డి, ఒక్క విస్సనమంత్రి (వగైరాలే) అరసికులై ఉంటే, ఒక్క శ్రీకృష్ణదేవరాయలు తన దండయాత్రలలో, వ్యక్తిగతమైన ఆడంబర అట్టహాసాలలో మునిగిపోయి, అధికార పదవిని నిలబెట్టుకోవడం కోసం అభారతీయ శత్రు పొరుగుతో సఖ్యపడి, ముఠాకట్టి, స్వజాతి బ్రతుకు తెరువునే అలక్ష్యం చేసి ఉంటే - అంతెందుకు, ఇటీవల ఏ ఆంధ్రరత్న మకుటాయమాన యశోధనుడి కువిమర్శకో భయపడి, ఏ ఎంకిపాటల సుబ్బారావో కలాన్ని ఏ కొల్లేరులోకో విసిరిపారేసిపోయి ఉంటే-

ఇలా ఆదిలేని వేదకాలం నుంచి అంతంలేని నావరకు కూడ — ఎంతైనా చెప్పవచ్చు - అలా అలా అయి ఉంటే, తెలుగుజాతి అభ్యుదయం ఇలా ఇలా జరిగి ఉండేదా, ప్రపంచ మానవ సమాజంలో తెలుగువాళ్లకు ఈ మాత్రపు గౌరవస్థానమైనా లభించి ఉండేదా అని!

ఇక్కడ ఇదంతా ఎందుకు చెపుతున్నానంటే—నిగ్రహానుగ్రహాశక్తి కలిగిన యువకులు మానవస్వభావాన్ని గుర్తించి, ఏ తత్స్వభావం ఏ కాలంలో ఏ దిక్కుగా ప్రవహిస్తున్నదో గమనించి, తదభిముఖంగా మానవాభ్యుదయ ప్రణాళికలను అమలుపరచిననాడే సక్రమమైన ఫలితాలు లభిస్తాయన్న సత్యాన్ని నిర్దేశించి చూపడానికే.

కృష్ణదేవరాయాదు లంతా ఆయా కాలాలలో అట్టి శక్తి కలిగిన వారే. ఈ నాడు వారి కోవకు చెందిన వారే ఈ "జీవితవలయాలు" కావ్యకర్త శ్రీ మాలకొండయ్యగారు.

ఈ గ్రంథంలో రకరకాల కవితలు మొత్తం అరవై అయిదు ఉన్నై. అందులో ప్రతి ఒక్క కవితా ఒక కళా ఖండం. అరవై నాలుగు కవితలూ అరవై నాలుగు కళలకూ ప్రతీకలు కాగా, ఆపైది ఏతత్సర్వకళా సరిత్పతి అయిన పరమాద్వైతం అనవచ్చు.

కవిత ఎలా పుడుతుంది? ఏదో ఒక మధుర బాధ వల్ల పుడుతుంది. ఏదో చెప్పాలనిపిస్తుంది. అలా అనిపించడమే మధురబాధ. అదేదో చెప్పకపోతే ఆ బాధ తీరదు. ప్రతిభావంతుడైన కవి జన్మించే దలాగే. అది సర్వకాలీన సత్యం. మాలకొండయ్యగారు సహజకవి.

ఇక్కడొక చిన్న వివరణ. బాధ మధురమైనదైనప్పుడే దానినుంచి కవిత పుడుతుంది. కళ పుడుతుంది. ఆకలి, దప్పిక, కురుపు, గాయం, కడుపునొప్పి, తలపోటు వంటి కాయిక బాధ మధుర బాధ కాదు. మధుర బాధ జీవం పోరి, కాయికబాధ నాశం కరి. కత్తి కలువపువ్వులు పుయ్యదు. మాత్సర్య ద్వేషాదులు ప్రాణం తీయగలవు. ప్రేమవలె ప్రాణంపోయలేవు.

కవిత ప్రేమాత్మకం. ప్రేమ మానవతా హృద్యం. మానవతకు మరోపేరు మాలకొండయ్యగారు.

"ఏదో చెప్పాలనిపిస్తున్నది నాకు" అన్నారు మాలకొండయ్యగారు. ఇదే ఆయన తొలిరచన. ఇదే ఆయన కవితా నవోదయంలో తొలి కిరణం. ఇది ఒక్క మాలకొండయ్యగారి అనుభవమే కాదు, నిజంగా కవి అయిన ప్రతివాడి తొలి అనుభవమూ ఇదే. ఏదో చెప్పాలన్న తహ తహ, అవ్యక్తమైన బాధ. ఆ బాధ ఎంత తీవ్రమైనదైతే అంత నిశితం—ఎంత మధురమైనదైతే కవిత అంత రసవంతం.

మాలకొండయ్యగారు నిర్విరామంగా పనిచేసే వ్యక్తి. ఒక్క వ్యక్తి ఎంతని చేయగలడు? తన పరిధిలో తానుచేస్తూ, అలా చెయ్యమని ప్రతి వ్యక్తికీ చెప్పడం అవసరమే. అందుకే చెప్పాలనిపించింది ఆయనకు. ఏదో

చెప్పాలి. వట్టి కబుర్లు చెప్పడంకాదు. చెప్పేది రసవంతంగా చెప్పాలి. కాంతా సమ్మితంగా చెప్పాలి. బుజ్జగించి చెప్పాలి. బుజ్జగించి ఎంత క్షతినంగా చెప్పినా పర్వాలేదు. హృదయంలో ఆర్ద్రత లేకుండా పైకి ఎంత మెత్తగా చెప్పినా ఫలితం ఉండదు. పైగా, ఆయసి కొక లక్ష్యం వుంది. దానిని స్పష్టంగా, అవసరమైతే పచ్చి వాచ్యంగా చెప్పాలి. ఎదురైన ప్రతి మనిషినీ నిలబెట్టి మానవాభ్యుదయానికి కృషి చెయ్యమని చెప్పాలి. అదే చెప్పారాయన—ఈ గ్రంథంలోని ప్రతి కవితలోనూ, ప్రతి పంక్తిలోనూ.

"పెండింగు ఫైళ్లు" ఒక అద్భుతమైన రచన. అది ఒక్క మాల కొండయ్యగారు మాత్రమే చెయ్యగలిగిన రచన.

అసలు తెలుగుజాతి బ్రతుకే ఇంతవరకు ఒక పెండింగు ఫైలు. ఏదో ఒక పరిష్కారం చేసేసి, దాన్ని క్లోజ్ చేస్తామని ఏ మహానీయుడో అనుకున్నప్పుడెల్లా, క్రింద నుంచి ఏదో ఒక వెర్రి, పైనుంచి ఏదో ఒక క్వెర్రి వస్తూనే ఉంటున్నది. అంతే కాదు, సంసార బద్ధుడైన జీవుడి కథ కూడ ఒక పెండింగు ఫైలే కదా! "పేదవాళ్ల ఫైళ్లు" లో పేదవాళ్లు అనే పదం ధన దరిద్రులకే కాక—వ్యంగ్య మర్యాద ననుసరించి—జ్ఞాన దరిద్రులకు, సుకృత దరిద్రులకు కూడ అన్వయిస్తుంది. అప్పుడిది ఒక ఆధ్యాత్మిక మహా సూక్తే కాదా?

నిజానికి, ఇదొక ధ్వని కావ్యం. అందుకే ఈవిధమైన నవనవోన్మేష శాలిని అయిన ప్రతిభ (ఒక కొత్తనీరు) సాహితీ క్షేత్రంలోకి రావాలని నేను పదే పదే కోరేది.

ఈ దృష్టితో-ధ్వనిదృష్టితో-పరిశీలిస్తే ఒక్క "పెండిగు ఫైళ్లు" మాత్రమే కాదు, ఈ గ్రంథంలోని ప్రతి రచనా కూడా, అదెంత స్వభావోక్తి చతురంగా పైకి కనిపిస్తుందో, అంత ధ్వన్యుక్తి ప్రౌఢంగా సహృదయులకు ఆనందం కలిగిస్తుంది.

రైతు గురించి ఎవరైనా వ్రాయవచ్చు. "హాలికులైన నేమి?" అన్నారు పోతన్నగారు. అంటే— పొలం దున్నుకొని బ్రతికేవాడు అడుక్కుతింటేనేం అనే కదా? సమాజం దృష్టిలో రైతుది అంతటి దీనస్థాయి!

తాను దీనస్థితిలో ఉండడం వేరు, సమాజం దృష్టిలో దీనస్థాయిలో ఉండడం వేరు. దీనస్థితికి ఎవరూ సిగ్గు పడనక్కర లేదు. దీనస్థాయిని మాత్రం సహించకూడదు. దీనినే "పెరగని రైతు" కవితలో ఎంతో చక్కగా వర్ణించారు మాలకొండయ్యగారు.

"మట్టిలో మణులు పండిస్తున్నాడని
పరిశ్రమలకు ప్రాణం పోస్తున్నాడని
రైతు లేందే రాజ్యం లేదని
అందరూ రైతును పొగుడుతారు"

అయితే—"ఈనగాచి నక్కల పాలవుతున్న" రైతు జీవితాన్ని గురించి, "ఎక్కడ వేసిన గొంగళి అక్కడే" అన్నట్టున్న రైతు ఆదాయం గురించి ఎవరైనా ఆలోచిస్తున్నారా అని ప్రశ్నిస్తున్నా రాయన. ఈ ప్రశ్నకు జవాబు ఎవరు చెప్పగలరు? చిక్కుముడి ఎవరు విప్పగలరు?

మాలకొండయ్యగారు తమ ప్రకృతి పరిశీలన శక్తినంతటినీ, ఏ తదనుభవ పారవశ్యరక్తి నంతటినీ కరిగించి, సహృదయ లోకాన్ని సౌందర్య స్నపితులను చేసిన సుకుమార కవిత "సెలయేరు".

"పక్షులైనా, పశువులైనా,
మనుషులైనా, మ్రాకులైనా,
అంతా ఒకటే అయిన సెలయేరు—
అందాలనూ, ఆనందాలనూ
అందరికీ పంచిపెట్టే సెలయేరు—
పక్షపాతం పాటించని సెలయేరు—"

ఈ సెలయేరు ఎంత శోభాకరమైనట్టిదో, అంత సోషలిస్టు! మాలకొండయ్యగారు కవితకు ఏవస్తువును స్వీకరించినా, దానిలో రసమూ, సౌందర్యమూ తో పాటు మానవతను కూడా సమపాళ్ళలో నింపుతారు! సౌందర్యంలో కూడ ఆయనకు సోషలిజమే కనిపిస్తుంది. అదీ నిజమైన కళాదృష్టి. అప్పుడే నవసృష్టి.

ఇది "పొగడ్త" కాదు. ఏ ఖర్చూలేని పొగడ్తలతో ఎవరినైనా సంతోష పెట్టవచ్చు. పొగడకపోతే దేవుడుకూడ కరుణించడు. "నిద్ర"కు కూడ పక్షపాతం లేదు. "రాజైనా, పేదైనా నిద్రాముద్రకు దాసోహ మనవల సిందే". ఇక్కడ ముద్ర అనే మాటలో ఎంత అధికార ముద్ర ఉందో చూడండి! నిద్ర అనేది ఒక సుప్రీం సోషలిస్టు అథారిటీ – మాలకొండయ్య గారి దృష్టిలో.

"మూఢనమ్మకా"లంటే గిట్ట దాయనకు. మన సమాజాన్ని అవి నాశనం చేశా యంటా రాయన.

"మనభవిష్యత్తు ఆ బల్లికి తెలుస్తుందా ?

మన జయాపజయాలు ఆ పిల్లి చేతిలో ఉన్నాయా ?"

అంటూ ప్రశ్నిస్తారు. అందుకే "నడుంకట్టి ముందుకు నడు" అంటూ యువ తరాన్ని ఉద్బోధిస్తారు.

"నీ సమాజం బూజుపడితే

జబ్బుపడే దెవరు ?

నీ వాతావరణం కుళ్ళిపోతే

చచ్చిపోయే దెవరు ?"

అని ప్రశ్నించి "నీవూ నీవాళ్ళే కదా" అని వేలెత్తిచూపి, "బూజుదులిపే బాధ్యత నీకు లేదా" అని హెచ్చరిస్తున్నా రాయన. కవితను సూటిగా చెప్ప డానికి ఇదొక చక్కని ఉదాహరణ.

పరిహసించడం ద్వారా చెడ్డను పరిహరించడంలో మాలకొండయ్యగారి శక్తి అపారం. కవితకు ఆత్మ అయిన ధ్వనికి, వ్యంగానికి ఆయన రచనలు ఆలయాలు.

నిజానికి, ఈ జీవిత వలయాలు—

ఆధునిక సమాజ జడస్థితికి విలయాలు,

సర్వమానవ ప్రగతిపథంలో కాంతినిలయాలు !

"జీవితవలయం" కవితలో ఉన్న పంక్తులు పదిమాత్రమే అయినా—ఉద్యోగమాత్రోపజీవి అయిన వ్యక్తి యొక్క జీవితపథం ఆద్యంతమూ ఇందులో సంవలయిత మయింది. అల్పాక్షరాలలో అనల్పార్థ రచనకు ఈ కవిత మచ్చుతునక.

చదువుకూ, సంధ్యకూ తీరిక లేని ఈ ఆధునిక యంత్రయుగంలో, కవితలు తెగబారెడు చెరుకుగడల్లా కాక, జేబీలో పట్టే జామిపళ్ళలా ఉండాలి. క్లుప్తంలో ఆకలి దప్పులు తీరుస్తూ, గుండెకు బలం కూడా ఇవ్వాలి. ఈ కవిత అందుకు చక్కని నిదర్శనం.

"పిసినిగొట్టు మరణిస్తే దానకర్ణుడంటారు !

దగాకోరు దహనమైతే ధర్మరాజంటారు !"

అంటూ—మర్యాద పేరుతో మానవసమాజం చేసుకొంటున్న ఆత్మవంచనను సూటిగా చూపుతున్నారాయన.

"మన గొప్పతనం తెలుసుకోవా లంటే

చచ్చి చూడాలి"

ఎంత గొప్ప విసురు !

"మిన్నుకూ, మన్నుకూ మధ్య గాలిలో జీవిస్తున్న" కొంద వాళ్లను గురించి ఎంతో చక్కని పరిశీలన చేశారు మాలకొండయ్యగారు.

"పాత ఏడాది చేసిందేమిటి? కొత్త ఉగాది చేయగలిగిందేమిటి"? ఏం లేదు, నిజమే. అలా అని చేతులు ముడుచుకు కూర్చోగూడదనీ, మన స్ఫూర్తిగా ప్రయత్నిస్తే మార్పు సాధ్యమే ననీ ఉద్ఘాటిస్తున్నా రాయన.

"వేట" ఒక కరుణ కావ్యం. నిజానికి ఈ గ్రంథంలోని రచన లన్నీ ఏదో ఒక విధంగా కరుణకావ్యాలే. మానవతకు కరుణే కదా పునాది!

"ఇంటర్‌వ్యూ", "దొరగారి దర్శనం", "కలెక్టరు కడగండ్లు" ఇవి మూడూ ఒక మాలకొండయ్యగారు మాత్రమే చెయ్యగలిగిన ప్రత్యేక రచనలు. వస్తువుతో గాఢ పరిచయమూ, సమ్యక్ అనుభవమూ ఉన్నప్పుడే రచయిత దానిని కవితగా రూపొందించ గలుగుతాడు. ఏ వస్తువునైనా సాహితీకరిం

చాలంటే, ఆ వస్తువులో కవి లీనమై వ్రాయాలి. అట్టి తన్మయతా సారస్వత సాక్షాత్కార ధన్యుడు మాలకొండయ్యగారు.

“ఏనాడు—ఆనాడు” ఒక మానవాభ్యుదయ పథకం. “కెమెరా క్లబ్బు”లో కవితా చిత్రాలను ప్రదర్శించా రాయన.

విషయ పరిజ్ఞానం లేకుండా విమర్శ చెయ్యగూడదని చెపుతూనే—

“ఆమ్లెట్ రుచి చెప్పాలంటే

గుడ్డు పెట్టు నవసరమా?”

అంటూ - విషయ రసాస్వాదనకు తద్విషయ సాక్షాత్ ధురీణత అక్కర లేదని కూడ అంటారు! నిజంగా ఈ రకం సత్యాన్ని చెప్పగలిగిన వాడే కదా ఋషి అంటే?

“చెప్పడం మన పని, చెయ్యడం మరొకరి పని” అని అందరూ అనుకోవడం వల్లనే పనిచేసే వాళ్లు లేక, జాతి అభ్యుదయం కుంటుపడు తున్నదన్న సత్యాన్ని ఎంత అందంగా చెప్పా రాయన! ఈ కవితకు “ఉపాది” కవిత ఒక అద్వితీయమైన ఉపాధిని కల్పించింది.

“మనం మనుషులం, సంఘం బ్రతికిఉన్న మనుషులతో కూడిన శవ పేటిక” అంటూ నిర్వచనంచేసి, మనుషులపై శవపేటిక పెత్తనం చేస్తున్న దంటూ నిశితగా విమర్శిస్తున్నా రాయన.

“పొరుగింటి పుల్లకూర”ను సహృదయు లందరికీ పంచిన పుణ్యం ఒక్క మాలకొండయ్యగారికే దక్కింది. “ఆశే ఈశ” ఆశను అధ్యాత్మీక రించిన రచన. ఆశ లేకపోతే అభ్యుదయమే లేదు మరి.

ఈ గ్రంథంలోని “ప్రయాణం” చదవకుండా ఎవరూ సరదాగా ప్రయాణం చెయ్యలేరు. “స్నేహితం” పఠించకుండా ఎవరూ మంచి స్నేహితులు కాలేరు. “అలవాట్లు” చూడకుండా దురలవాట్లు పోగొట్టుకో లేరు. “నవ్వు”ను చదవనిదే నోటార నవ్వలేరు. “సిగ్గు”ను గ్రహించందే మల్లె మొగ్గల్లా సిగ్గుపడలేరు. “ప్రేమ” చదివి “స్త్రీ”ని చూడకుండా, “భార్య”కు “వెల్లుల్లిశాస్త్రికథ” చెప్పి “పూజలు” చెయ్యలేరు.

ప్రతిరోజూ ఎందరెందరు "విమానయానం" చెయ్యడం లేదు? అందులో ఉన్న అపూర్వ సౌందర్యాన్ని గుర్తించి చెప్పిందెవరు? స్వర్గం పైనెక్కడో లేదనీ, పైనుంచి చూచినప్పుడు అది క్రింద భూమి మీదనే కనిపిస్తుందనీ అంటారు మాలకొండయ్యగారు. పైనుంచి చూడడమంటే హెచ్చు తగ్గులకు అతీతమైన దృష్టితో చూడడమన్న వ్యంగ్యాన్ని ఆశ్రయిస్తే - ఎన్నో "అందాలూ, ఆనందాలూ" కనిపిస్తాయిందులో.

సమాజంలోని నేటి అరిష్టాలన్నిటికీ కారణం మన ప్రజల బాధ్యతారహిత ప్రవర్తనమే అంటూ నిర్మొగమాటంగా "నడిరోడ్డులో" అన్న కవిత ప్రాశారాయన.

"కొంచెం మసక చీకటి కమ్మితే చాలు

రోడ్లన్నీ మరుగు దొడ్లే అయిపోతాయి —"

తెలుగునాట ప్రతినిత్యమూ ప్రతివారి కంటా పడుతున్న దృశ్యాలే ఇవి. అయితే - ఏ దృశ్యమైనా కవి కంటిలో పడ్డప్పుడే దానికి అమృతత్వం సిద్ధిస్తుంది.

"మనవాళ్లు ఆత్మవంచనకూ
అపరిశుభ్రతకూ జంకరు!"

"బూతు మాటలే మనకు నిషేధం, బూతు పనులు కాదు" నిజం! బూతు మాటలు కూడా సంస్కృతంలో వుంటే నిషేధం కాదు!!

"అందమైన అబద్ధాలాడడం

అందరూ నేర్చుకొంటున్నారు."

అంటూ నిర్వేదం ప్రకటిస్తున్నారు మాలకొండయ్యగారు. అబద్ధాలాడడం మానవుడి జన్మ హక్కు! నేర్చుకోవడమనే ప్రసక్తే లేదు. అయితే - దానినొక కళగా అభ్యాసం చేస్తున్నారనవచ్చు. ఇందులో-బెల్లంలో ఎర్రమన్ను, మిరియాలలో బొప్పాయి గింజలు, బియ్యంలో లలితసుకుమార తెల్లరాళ్లు (వగైరా) కలిపి డబ్బు చేసుకోవడం వంటి జాతీయ అంతర్జాతీయ మహాకళ కూడ వ్యంజిత మవుతున్నది. విషయజ్ఞులు గమనించగలరు.

"చెప్పు"లో, "ఇటుక"లో, "కలం"లో, "ఎరువుసొమ్ము"లో కూడ "శ్రీరంగనీతులు" కనిపిస్తా యాయనకు! "చాడీలు"లో "కనిపించని కారణాలు" కనిపించకపోతే, "ఎవరికి నష్టం?" "దుఃఖం" కలుగుతుంది, "కోపం" వస్తుంది, "మంచీ చెడూ" అనకుండా-

"చాడీలు చంపుతాయి

అవి తగిలే చాలమందిని!"

"ఎవరా చిన్నది" అన్న రచన మాలకొండయ్యగారి సాహితీ రూపరచనాశక్తికి పరాకాష్ఠ. మన నేలలో, మన మ్రోలనే ఎల్లప్పుడూ కనిపించే ఆమె-

"వెన్నెల లాగున్నది

ఎండలో పోతున్నది,

పూవు లాగున్నది

పూరి గుడిసెలో ఉంటున్నది!"

ఈ చిన్నదానిని ఆనాడు గుర్తించినవాడు కరుణాళువైన వాల్మీకి. వరించినవాడు "పట్టాభిషేకంబు వనవాసముగ మార, చింత" తనను చేరని శ్రీరాముడు!

మనం — పురాణాలను, కావ్యాలను ఎవో కట్టుకథలుగా కాక — ఎప్పుడో, ఎక్కడో జరిగిన చారిత్రక సత్యాలుగానో - కనీసం మానవ ప్రావృత్తిక నిత్యాలుగానో గమనించగలిగితే మన శతాధిక మహర్షులేకాక, హరిశ్చంద్ర శ్రీరామ ధర్మరాజాది పాలకులుకూడ ఐచ్ఛికంగా ఈ చిన్నదానిని వరించే గొప్పవారైనా రన్న పరమసత్యం గోచరించదా?

మన వైదిక సమాజం

సోషలిష్టు సమాజమే

అన్న సత్యం

ఆ విష్కృతం కాదా?

"అదృష్టం" అంటే వేరే ఏమీలేదనీ, పనే అదృష్టమనీ అంటూ - మంచీ, చెడూ రెండూ లోకంలో పక్క పక్కనే వుంటూ వుంటాయనీ, సద సద్వివేకం కోసం మనం ఎప్పుడూ ఆర్గురు మిత్రుల సలహాలను పొందుతూ వుండాలనీ మనకు సలహా ఇస్తున్నా రాయన.

"ఆరుగురు మిత్రులు" ఒక అద్భుతమైన బాలగేయం. ఈ గేయరచనతో మాలకొండయ్యగారు కొత్తగా బాలలకు ఏడవ మిత్రులైనారు. [ఆరు ఋతువులతో తృప్తి చెందక, నేను ఏడో ఋతువును (The Seventh Season) సృష్టించుకొన్నట్టు!]

ప్రశ్నార్థకాలను పరమమిత్రులుగా సృష్టించి, బాలలకు బాలమిత్రులైన మాలకొండయ్యగారు కవితా సృష్టికి కళ్యాణ బ్రహ్మలైనారు. సమకాలీన సమాజం నుంచి వెనక్కి ఒక "జనరేషన్‌గేప్"లో తిరోగమిస్తున్న తెలుగుకు వాస్తవికతా దృగ్దీపం పట్టారు. పెరగని రైతు ఇబ్బందులతో పాటు కలక్టరు కడగండ్లను కూడ లోకానికి చూపి, సానుభూతి కోరారు. అందుకు ప్రతిఫలంగా రసానుభూతిని అందిచ్చారు.

ఇందులో వున్న కవితలు, అదీ ఇదీ అన్నీ కలిసి, "అదీ – ఇదీ" రచనలో బ్రహ్మైక్యం పొందాయి. ఈ ద్వంద్వంలో మనకు ధ్వన్యమానమవుతున్నది జీవబ్రహ్మైక్యమే కదా?

మాలకొండయ్యగారు "కారులో కవిత్వం" వ్రాస్తే, నేను ఈ పీఠిక రైల్లో వ్రాశాను. ఒడిదుడుకులు, దుందుడుకులు, కుదుపులు, కదుపులు ఏవైనా వుంటే సహృదయులు క్షమించగలరు.

బోయి భీమన్న

# నా మాట

ఎన్నాళ్లనుంచో నేను కన్నకలలు ఈనాడు ఫలించాయి. నేను చిన్ననాటినుంచీ పొందిన అనుభూతులు నేటికి ఒక అక్షరాకృతి ధరించాయి. ఏదో చెప్పాలని, ఏదో వ్రాయాలనే ఒక ఆవేశం విద్యార్థిదశనుంచే నాలో ఉంది. ఆ ఆవేశంతో జీవితాన్ని అనుభవించి, పరిశీలించి, నేను కనుగొన్న సుఖదుఃఖాలు ఈ "జీవిత వలయాలు"

నేను విద్యార్థిగా ఉన్నప్పుడూ, ఆ తర్వాత గుంటూరు జిల్లా ప్లానింగ్ ఆఫీసరుగా పనిచేసి నప్పుడూ కొన్ని పద్యాలు, వ్యాసాలు, నాటికలు వ్రాశాను. అవి ఆయా పత్రికల్లో ప్రచురింపబడు తుండేవి. కొన్ని నాటికలుకూడ ప్రదర్శింపబడ్డాయి. అప్పుడు ముఖ్యమంత్రిగా ఉన్న డా॥ బెజవాడ గోపాలరెడ్డిగారు, ప్రణాళికా మంత్రిగా ఉన్న శ్రీ కళా వేంకటరావుగారు, ప్లానింగ్ డిప్యూటీ కమీషనర్‌గా పనిచేస్తున్న శ్రీ సింహాద్రిగారు, గవర్నర్ శ్రీ త్రివేదిగారు — మున్నగు పెద్దలు నా సాహిత్య కృషిని ప్రశంసించి నన్ను ప్రోత్సహించారు. ముఖ్యంగా వారు నా "అభినవ సావిత్రి" నాటక ప్రదర్శనాన్ని చూచి ఎంతో ఆనందించి, దాన్ని మళ్ళీ మళ్ళీ ప్రదర్శింపచేసుకొని, నాకు పెండేకంటి వెంకటసుబ్బయ్య బంగారు పతకం బహూకరించారు. ఆ తర్వాత కొంతవరకు ఔద్యోగిక కార్యభారంవల్లా, చాల వరకు నా నిర్లక్ష్యంవల్లా నా రచనా వ్యాసంగం దాదాపు మూలబడింది.

అయితే, నేను 1965–66లో ఉన్నత విద్యా విషయంలో ఇటలీ దేశం వెళ్ళడం, తిరిగి వచ్చింతర్వాత కరీంనగరం జిల్లా కలెక్టర్ని కావడం తో — నా లోని నిద్రాణ రచయిత మేల్కొని,

ప్రకృతి సౌందర్యాన్నీ, ప్రజల సమస్యలనూ అనేక దృక్కోణాల నుంచి పరిశీలించే అవకాశం లభించింది. కొన్ని పరిశీలనాత్మక వ్యాసాలు తెలుగు, ఇంగ్లీషు పత్రికల్లో ప్రచురించడం కూడా జరిగింది.

నేను తూర్పుగోదావరి జిల్లా కలక్టర్‌గా వెళ్ళినప్పటినుంచీ నాలోని కవితాలత వసంతానుభూతిని పొంది, మళ్ళీ మొగ్గతొడిగింది. మన సాహిత్యానికీ సంస్కృతికీ ఆటపట్టుఅయిన గోదావరీనదీ, అక్కడి పరిసరాలలో ప్రకృతి వెదజల్లిన సౌందర్యంతోపాటు అక్కడి సాహిత్య వాతావరణమూ నా కవితా వ్యాసంగానికి ఎంతో దోహదం కలిగించాయి.

1971లో అఖిల భారత తెలుగు రచయితల మహాసభ సమావేశాలు జరిగినప్పుడు "తెలుగు—ఇటాలియన్" భాషల తులనాత్మక పరిశీలనను గురించి ప్రసంగించే అవకాశం నాకు లభించింది. అలాగే "విజయవాడ అభ్యుదయవేదిక" వేదిక నుంచి జాషువా గారి "గబ్బిలం" కావ్యంయొక్క కవిత్వతత్వ విచారణచేసే అదృష్టం కలిగింది. ఈ విధంగా నా సాహిత్యకృషికి ప్రోత్సాహం కలిగించిన వారందరికీ-ముఖ్యంగా శ్రీయుతులు పోతుకూచి సాంబశివరావు, దేవులపల్లి రామానుజారావు, ఆచార్య దివాకర్ల వేంకటావధాని, యలమంచిలి చంద్రశేఖర్, అడుసుమిల్లి పూర్ణచంద్రరావు గారలకు—ఈ కృషిలో సహకరిస్తున్న ఇంకా అనేకమంది మిత్రులకు నేనెంతో కృతజ్ఞుణ్ని.

ఈ సందర్భంలో నా రచనలు ప్రచురిస్తున్న పత్రికలవారికి, ప్రత్యేకంగా ఆంధ్రపత్రిక, భారతి, దక్కన్ క్రానికల్, ఇండియన్ ఎక్స్‌ప్రెస్, ఆంధ్రజ్యోతి సంపాదకులకు నా హార్దికాభివందనాలను తప్పకుండా చెప్పవలసిఉంది.

ఇక నా ఈ 'జీవిత వలయాలు' గురించి ఓ మాట—

నేనప్పుడప్పుడు అనేక సందర్భాలలో వ్రాసిన వచన కవితలను సంపుటీకరించి, ఈ రూపంలో ప్రచురించడానికి ప్రోత్సహించిన నా సాహితీ మిత్రులు కళాప్రపూర్ణ డాక్టర్ బోయి భీమన్న గారికీ, శ్రీ జె. బాపురెడ్డిగారికీ నా హృదయపూర్వకమైన కృతజ్ఞతలు. వారి సలహా సహకారాలు ఈ ప్రయత్నంలో నాకు ఎంతో తోడ్పడ్డాయని చెప్పడానికి మిక్కిలిగా సంతోషిస్తున్నాను.

నే నేమి వ్రాసినా మొట్టమొదటగా విని, అందులోని మంచి చెడ్డలను గురించి చర్చిస్తూ, నాలోని ఈ సరస్వతి పెరిగి పుష్పించడానికి దోహదం చేస్తున్న నా అర్ధాంగి శ్రీమతి లక్ష్మకీ, విమర్శ ద్వారా ప్రగతిని నిర్దేసిస్తున్న నా కుమారులకూ నేను ఒక విధంగా ఋణపడి ఉన్నాను.

ఈ పుస్తకాన్ని సకాలంలో సుందరంగా ముద్రించిన, ప్రచురించిన వివేకానంద ప్రింటర్స్‌వారికి, ఈ పుస్తక ముఖచిత్రాన్ని రచించిన శ్రీ సత్యమూర్తిగారికి నా అభివందనాలు. ఈపుస్తకాన్ని నా అపార నిర్మలప్రేమమందారమాలగా కాలగర్భంలో కనుమూసుకొన్న నా తలిదండ్రులకు సమర్పిస్తున్నాను.

లింగం మాలకొండయ్య

# నన్ను కన్నవారికి

హృదయం అర్పిస్తున్నాను
కవితాహృదయం సమర్పిస్తున్నాను
కవిగా నను నేనే అర్పిస్తున్నాను
కవితనే కమలాల మాలగా సమర్పిస్తున్నాను
నను కన్నవారికి
నా నిండా నిండి ఉన్నవారికి
అమ్మకు — అనంతమ్మకు
అయ్యకు — రోశయ్యకు.

ఆరని దీపాన్ని
నా భావనా రూపాన్ని
ఈ కవితా పారిజాతాన్ని
నా అనుభూతి గీతాన్ని
అర్పిస్తున్నాను.

నాలో ఏదైనా సుగుణం ఉంటే
నాన్న — అమ్మ పుణ్యఫలం,
నావల్ల ఏదైనా సుకృతం జరిగితే
అది వాళ్ల ఆకాంక్షల స్వాదు ఫలం.

అందుకే—
నా జీవితం ధన్య మయే టందుకే—
అర్పిస్తున్నాను
అంకితం చేస్తున్నాను
జీవిత వలయాలను అధిగమించే
ఈ నా 'జీవిత వలయాలను',
మానవత్వంలో మునిగితేలా లని—
మానవతా శిఖరాలకు మనిషిని చేర్చాలని.

మాలకొండయ్య

# ఇందులో—

# జీవిత వలయాలు

## ౨౧

## అనిపిస్తుంది నాకు

అనిపిస్తుంది నాకు
ఏదో చెప్పా లనిపిస్తుంది నాకు.

ఆవేశం, ఆవేగం
ఆందోళన, ఆవేదన
అడ్డుగట్లులేకుండా
తోసుకు వస్తుంటే —

ఉద్వేగం, ఉత్సాహం
ఉద్రేకం, ఉరకలు వేస్తూ
ముందుకు దుముకు తుంటే –
అనిపిస్తుంది నాకు
ఏదో చెప్పా లనిపిస్తుంది నాకు.

వయసు కొంత మళ్లినా
మళ్లీ చూడా లనిపిస్తుంది
వెనక్కు మళ్లి, మొదటికి వెళ్లి
మళ్లీరావా లనిపిస్తుంది.

చూసే వన్నీ, చేసే వన్నీ
తనివి తీర చెప్పాలని –
మనసులోని ఆలోచనలను
ఆవేదనలను
ముసుగు విప్పి
కలం కుంచె రంగులతో
కధలుగా, కవితలుగా
కాలం గుండెల్లో వెదజల్లా లని –

అనిపిస్తుంది నాకు
ఏదో చెప్పా లనిపిస్తుంది నాకు.

# 2. పెండింగు ఫైళ్ళు

ప్రజల కోర్కెలు, కష్టాలు, సమస్యలు
ప్రభుత్వంవారికి తెలియాలంటే
పెట్టుకోవాలి అర్జీలు, దరఖాస్తులు.

గుమాస్తాల చేతుల్లో
అనేక అంతస్తుల్లో
అవి పరీక్షించబడతాయి,
రూల్సుప్రకారం ఆఫీసర్లు చూస్తారు,
క్రిందివాళ్ళు సరే అంటే, వేస్తారు ఆర్డర్లు.

ఆశ్చర్యాలలో ఆశ్చర్యం
ఆ అర్జీకాగితాల ప్రయాణం!
నెలల తరబడీ, సంవత్సరాల తరబడీ
చంక్రమణం చేస్తుంటాయి కొన్ని

క్షణాలలో డిస్పోజ్ అవుతాయి కొన్ని
తరతరాలు పెండింగుగానే ఉంటాయి కొన్ని!

జి. టి. ఎక్స్‌ప్రెస్ కూడా బలాదూర్
కొన్ని ఫైళ్ళ స్పీడు ముందు,
నత్తగుల్లలే రేసు కుక్కలు
కొన్ని ఫైళ్ళ మందగమనాల ముందు.

పైవారు క్రింది వారికి
ప్రశ్నలు వేస్తారు ఏవేవో,
క్రిందివారు పైవారికి
జవాబులు వ్రాస్తారు తోచినట్లు.

పాపం ఆ పిచ్చి పిటీషన్‌దార్లకు
ఇదంతా ఓ పెద్ద కొశ్చెన్‌మార్కు!
అర్థంలేని-అవసరంలేని గొడవ-గందరగోళం!

పెండింగ్ ఫైళ్ళు అంటే
పేదవారి కనీసపు అవసరాలు తీర్చడానికి
పెట్టుకున్న కాగితాల కట్టల దొంతర!
బూజు దుప్పటి ముసుగు పెట్టుకొని
హాయిగా నిద్రపోతూ వుంటా యవి.

ఆ కుంభకర్ణుల్ని లేపడానికి
అంకుశాల్లాంటి
రన్నింగ్ నోటు ఫైళ్ళు ఉన్నాయి,
రన్నింగ్ ఫైళ్ళను నడపడానికి
చెకింగ్ రిజిష్టర్లు ఉన్నాయి,
పైవారు చెక్ చేస్తే అన్నీ సరిగ్గానే ఉంటాయి.

"అంగట్లో అన్నీ ఉన్నాయిగాని
అల్లుడి నోట్లో శని" అన్నట్లు
అర్జీదార్ల కడగండ్లు అలాగే ఉంటాయి,
పేదవాళ్ళ ఫైళ్ళు పెండింగ్ గానే ఉంటాయి !

ఉద్యోగస్థుల జీతాలు నెల నెలా వస్తూనే వుంటాయి !
పెండింగ్ ఫైళ్ళు అనే ఎడ్ల బండ్లు
పడుతూ లేస్తూ ప్రయాణిస్తూనే ఉంటాయి!

ఆఫీసర్లు దేవుళ్ళో కాదో గాని —
ఆఫీసు లనే గుడుల మంటపాల్లో మాత్రం
పడి గాపులు పడివుంటారు ప్రతినిత్యం
పలురకాల అర్జీల యాత్రికులు !

# 3. పెరగని రైతు

ప్రొద్దున్నే లేస్తాడు
పొలానికి వెడతాడు
ఎద్దుల్నీ, దున్నల్నీ నమ్ముకొని
మబ్బుల్నీ మట్టినీ నమ్ముకొని
కాడి గడతాడు
తాడు పడతాడు.

ఏర్వాక నుండి ఏడాది పొడుగునా
రెక్కలకు క్షణం తీరిక ఉండదు,
డొక్క ఒక్కనాడైనా నిండదు.

ఎరువులకు కరువు
అప్పుల మూట బరువు
ఒక ఏడు అతివృష్టి బాధ,

ఒక ఏడు అనావృష్టి యాతన,
అన్నీ సహిస్తూ
ఆశయే ఆధారంగా నడుస్తూ
సాగిపోతుంటాడు రైతు రాజు
వస్తుందని తనకు సంతోషం కలిగించే రోజు.

మట్టిలో మణులు పండిస్తున్నాడని,
పట్టణాలకు పరిశ్రమలకు
ప్రాణం పోస్తున్నాడని,
రైతు లేందే రాజ్యంలేదని,
అందరూ అతణ్ణి పొగడుతారు.

అయితే—
ఈనగాచి నక్కల పాలౌతున్న
ఆయన జీవితం,
"ఎక్కడ వేసిన గొంగళి అక్కడే"
అన్నట్లు ఉన్న ఆయన ఆదాయం,

ఎప్పుడు బాగుపడతాయో
ఎవరైనా చెప్పగలరా ?
ఎలా బాగు పడతాయో
చిక్కుల ముడి విప్పగలరా ?

# 4. సెలయేరు

గలగల పారే సెలయేరు
మిలమిల మెరిసే సెలయేరు
స రి గ మ ప ద ని స – సంగీతం
శ్రుతి తప్పక పాడే సెలయేరు

కొండలకు భయపడక
కోనలకు బెదరిపోక
నిండుగా పారే సెలయేరు

అలజడి లేని సెలయేరు
అందా లొలికించే సెలయేరు
పాటలో పరవశమై
పరిసరాలను పరికించని సెలయేరు

అందంగా చిందులు తొక్కే సెలయేరు
అందరినీ—వచ్చేపోయే వారందరినీ
తనదరి జేరిన వారందరినీ
తరింపజేసే సెలయేరు
తన్మయుల్ని చేసే సెలయేరు
వెలలేని ఆనందాన్ని
వెదజల్లే సెలయేరు

గణగణమని పరుగులుతీసే సెలయేరు
పరుల గుణగణాలతో పనిలేని సెలయేరు
గుండె విప్పి ఆడుకొనే సెలయేరు
పరుల దుండగాలతో పనిలేని సెలయేరు

పక్షులైనా, పశువులైనా
మనుషులైనా, క్రూరమృగాలైనా
అంతా ఒకటే తన ముందు
పక్షపాతం పాటించని సెలయేరు

అందాలను ఆనందాలను
అందరికీ పంచిపెట్టే సెలయేరు
వేసట ఎరుగని సెలయేరు
ద్వేషం తెలయని సెలయేరు

## 5. పొగడ్త

నన్నడిగితే—
అన్ని కళల్లోకీ
పొగడ్త గొప్ప కళ అంటాను.

పొగడ నేర్చినవారి పొగడ్తలకు
పొంగి పడిపోగూడదనుకుంటాను

అయినా, ఆ విషవలయంలో
అప్పుడప్పుడు చిక్కుకుంటాను.

చెవిటి వాడికి కూడా వినిపిస్తుంది పొగడ్త,
గుడ్డివాడికి కూడా కనిపిస్తాడు పొగిడే వాడు.
తీయతీయగా ఉంటుంది పొగడ్త,
పొగడ వద్దంటుంటాం కాని—
పొగడక పోతే బాధ పడుతుంటాం !

పొగడ్త బ్రతుకు తెరువు కొందరికి,
దానిలో వాళ్ళు వ్యాపారం వ్యవహారం నడిపిస్తారు.
కొందరి కది అందమైన సరదా,
ఏ ఖర్చూ లేని పొగడ్తలతో
ఎవరినైనా సంతోషపెడతారు.

ప్రమోషన్లకు పాసుపోర్టుగా
స్వలాభాలకు సాధనంగా
అభిమానార్జనలకు ఆధార భూతంగా
ఉపయోగిస్తారు పొగడ్తలను కొందరు.

పొగడ్తను కళగా వాడుకో గల్గినవారు
లోకంలో విజయం సాధిస్తారు

విజ్ఞానుల్ని కూడా వెర్రివాళ్ళను చేస్తారు.
ఆత్మస్తుతి అంటే
అభిమానం లేనివారు అరుదు,
ముఖస్తుతి ఆలాంటి వారికి
అనుకూలంగా వుంటుంది.

పొగిడే వారు అంటే అందరికీ ఇష్టమే
అయితే ఆ పొగడడం చేతగాక పోతే
ఛో ఛో అని విసుక్కుంటాం.
పొగిడే వాణ్ణి పైకెంత దూషించినా
నిజానికి వాణ్ణి ద్వేషించలేం.

రవ్వంతైనా పొగడలేని వాణ్ణి
అసలు రానివ్వ రెవ్వరూ దగ్గరకు,
పొగడలేని వాని ప్రతిభను గుర్తించరు
పొగడ లేని వాని గుణాలు రాణించవు.

ఎన్ని మర్యాదలు చేసినా
ఏదోరకంగా పొగడకపోతే
అంతా అమర్యాదగానే కనిపిస్తుంది.
పొగడకపోతే దేవుడు కూడా కరుణించడు !
మరి పొగడక ఏంజేస్తాం ?

# 6. నిద్రా ముద్ర

నిద్రను కనిపెట్టిన వాడు
నిజంగా మహనీయుడే,
మహనీయు డేమిటి
మహా దేవుడే !

నిజమైన సౌఖ్యం
నిద్రలో ఉంది
అన్ని కష్టాలకు ఆవేదనలకు
అది ఉపశమనం కల్గింస్తుంది !

ఆకలి గొన్నవారికి అది ఆహారం
దప్పిగొన్నవారికి అది పానీయం

ఎండలో మాడిపోయే వాడికి నిద్ర నీడ
చలిలో వణికిపోయే వాడికి నిద్ర దుప్పటి ✓
గూడు లేనివాడికి నిద్ర కుటీరం
''నా''యనే వారు లేనివాడికి నిద్ర ప్రాణమిత్రం.

నిద్రకు పక్షపాతం లేదు
నిద్రకు వేళాపాళా లేదు
పండితుడైనా పామరుడైనా
రాజైనా పేదైనా
పసిబాలుడైనా వస్తాదైనా
నిద్రా ముద్రకు
దాసోహం అనవలసిందే !

జాగృతి జీవనం
నిద్ర మరణం
జాగృతి, నిద్ర జీవన్మరణాలు
వెలుగు నీడలు.

శాంతిని తలపిస్తుంది నిద్ర
చావును మరిపిస్తుంది నిద్ర
ఇవ్వాళ నిద్రపోతేనే
రేపు చైతన్యం.

# 7. కారులో కవిత్వం

కారులో కవిత్వం
బారులో తత్వం
పుడుతుందని కనుక్కొన్నాను
అనుభవం మీద కొంత
అవలోకనం మీద కొంత.

కారు కవితావస్తువు కావచ్చు
కాల నడిచి పోయే వాళ్ళకు,
కారులో పోయే వాళ్ళకు
కనిపించే దంతా
కవితా మయమే!

కదులుతున్న కారులో కూర్చుంటే
కదులుతుంటాయి ఊహలు,
కారు వేగం పెరిగే కొద్దీ
కారు సీటు ఉయ్యేలలా ఊగే కొద్దీ
మూసుకొంటాయి చర్మ చక్షువులు,
తెరుచుకుంటాయి ఊహా చక్షువులు.

ఎంత పెద్ద వాడైనా
నా అంత చిన్నవాడై పోతాడు,
కంటాడు ఏవేవో కలలు

వింటాడు వింతవింత శ్రుతులు
చెప్పుతాడు చెప్పరాని విశేషాలేవో
చిట్టి పాపలా
పిచ్చి వాడిలా!

వేగం ఎక్కువైన కొద్దీ
ఆవేగం ఎక్కువౌతుంది
క్షణాలు కరిగి పోతుంటే
అక్షరాలు కాగితం మీద భావాలకు
ఆకారం కల్పిస్తుంటాయి.

చేరవలసిన చోటు రాగానే
కారు తపీమని ఆగి పోగానే
చివుక్కుమంటుంది ప్రాణం
సిరా కక్కుతుంది కలం.

ప్రాణం వచ్చిన కాగితాన్ని
గానం నేర్చిన కలాన్ని
జేబులో వేసుకొని
దిగి పోతారు కారు
కారులో తప్ప కవిత్వం
వ్రాయలేని నా వంటివారు.

నీ కలంతో కలిగించు నిత్యకళ్యాణాలను,
నీ కండలతో కట్టు పచ్చతోరణాలను,
నీ సిరాతో చిత్రించు అభివృద్ధి పటాన్ని,
నీ పదాలతో నిర్మించు క్రాంతి పథాన్ని.

ఇంత భారమా అని క్రుంగిపోకు,
అంత దూరమా అని కూర్చోకు,
నీవు యువకుడవు !
అకాల వృద్ధుడవు కాబోకు !

x x x x

నీ సమాజం బూజుపడితే
జబ్బుపడే దెవరు ?
నీ వాతావరణం కుళ్లిపోతే
చచ్చిపోయే దెవరు ?

నీవూ, నీవాళ్ళే కాదా ?
బూజు దులిపే బాధ్యత నీకు లేదా ?
కలానికి పదును పెట్టుకో !
ముక్కుకు సూటిగా నడుచుకో !

చీకటిని నిందిస్తే వస్తుందా వెలుగు ?
లేమిని ఛీకొడితే వస్తుందా కలిమి ?
నొప్పిని తిట్టితే పోతుందా బాధ ?
చెడ్డను విమర్శిస్తే ఊడిపడుతుందా మంచి ?

ఉపక్రమించి ఉరకాలి రంగంలోకి,
నడుంగట్టి నడపాలి నీ కలాన్ని,
నిలవాలి ధైర్యంతో
నీటద్రోసి నీలోని కుంభకర్ణుణ్ణి !

x x x x

పెద్దపులులు గాండ్రిస్తాయి,
పెను పాములు బుసకొడతాయి,
వాటి స్వభావం మాన్పాలంటే,
నీ కర్తవ్యం ఏమిటి ?

నీ యువత్వం, నవత్వం ఎండి రాలకముందే,
నీ గుండెల్లో వృద్ధాప్యం గూడు కట్టకముందే,
నీవు చేయగలిగిందేదో చేయి !
మానవ శ్రేయస్సునే కలంలో నింపుకొని వ్రాయి !

# 9. మూఢ నమ్మకాలు

నమ్మకాలు – మూఢ నమ్మకాలు
ఎవరు పుట్టించారో ఎందుకు పుట్టించారో,
నేడు మన సమాజాన్ని నిర్మూలిస్తున్న
చీడపురుగులై కూర్చున్నాయి అవి !

అజ్ఞానులను అంధకారంలో ముంచడానికో
అమాయకులవల్ల లాభం పొందడానికో
చిత్రంగా కల్పించారు మూఢ నమ్మకాలను
చచ్చినా వదలని మనపాలిటి సైతానులను.

తుమ్మకూ, దగ్గుకూ
పిల్లినడకకూ, బల్లిపలుకుకూ
కాకి ఎగరడానికి, నక్క అరవడానికి
కల్పించారు వింత వింత అర్థాలు
కట్టారు ముంతకుచెవుల కట్టుకథలు
పెట్టారు బోడి తలలకు మోకాళ్ళకు ముడులు!

తుమ్మితే అపశకునమా?
దగ్గితే తగ్గుతుందా శుభం?
మన భవిష్యత్తు ఆ బల్లికి తెలుస్తుందా?
మన బ్రతుకు సంగతి ఈ పిల్లి జోస్యం చెపుతుందా?
కాకి కుడికి, గ్రద్ద ఎడమకు ఎగరరాదా?

పిల్లి – బల్లి – కాకి – నక్క –
మనకు పురోహితులా?
మన పనులకు ప్రయాణాలకు
అవి ముహూర్తాలు పెడతాయా?

వారంలోని ఏడురోజులు ఏడు రకాలా?
అందులో కొన్నిమంచివి మరికొన్ని చెడ్డవా?

మంచి శకునాలు చూసుకొని
మంచిరోజులు మనసులో ఉంచుకొని
చేసిన పను లన్నీ ఫలించాయా?
అలా చేయనివన్నీ చెడిపోయాయా?
శుభముహూర్తంలో చేసిన పెళ్ళిళ్ళు
బ్రద్దలు కాలేదా?
మంచిరోజున కట్టిన యిల్లు కూలిపోలేదా?
రాముని పట్టాభిషేక సుముహూర్తం ఏమయింది?
అన్నీచూచి, తూచి ముహూర్తంపెట్టినా
అరణ్యవాసం ఎందుకు పట్టింది?

ఎవరు కల్పించిన వీ మూఢ నమ్మకాలు?
ఎందుకు నమ్మాలి ఈ చచ్చుహెచ్చరికలు?

# 10. బ్రతకని బిడ్డ

దక్కని వస్తువు
చిక్కని అవకాశం
పొంగిన పాలు
బ్రతకని బిడ్డ
విలువ లేనివి,
గుణాలు తప్ప లోపాలు లేనివి.

చేతికి దొరికినదానికి విలువ తక్కువ
చిక్కిన అవకాశంపై మక్కువ తక్కువ
మన గొప్పతనం తెలుసుకోవా లంటే
చచ్చి చూడాలి!

మన ఘనత ఇతరులు గుర్తించాలంటే
ఈ లోకం వీడిపోవాలి!

అదృష్టవశాత్తు చచ్చారా ఎవరైనా
అన్నీ సుగుణాలే వారికి,
నిందలన్నీ బ్రతికిన వాళ్ళకే
బ్రతకని బిడ్డకు మచ్చేలేదు.

పిసినిగొట్టు చస్తే దానకర్ణుడంటారు
అబద్దాలకోరు మరణిస్తే హరిశ్చంద్రుడంటారు
మూర్ఖుడు కన్నుమూస్తే ఉద్దండ పండితుడంటారు
దగాకోరు దహనమైతే ధర్మరాజంటారు
ఏకులాంటివాడు బ్రతకలేక చస్తే
మేకులా బ్రతికాడంటారు.

వట్టిగొడ్డు మట్టికలిస్తే
పుట్టెడు పాలిచ్చేదని రాగాలు తీస్తారు
ఎంగిలి చేతితో కాకినైనా తోలని ఎంకమ్మ
కాటిలో కాలు పెట్టగానే
అంతటి అన్నపూర్ణ లేదంటారు
బ్రతికిన బిడ్డ లేకపోయినా బెత్తెడంత
చావగానే అయిపోతుంది బారెడంత!

# 11. తక్కువే ఎక్కువ

ఆహారోత్పత్తిని పెంచడానికి
పథకం అవసరమైతే
సంతానోత్పత్తిని తగ్గించడానికి
పథకం అవసరమైంది నేడు.

ఎక్కువ పంటలు పండించితే
కృషి పండిత బిరుదు యిస్తే
తక్కువ పిల్లలు కన్నందుకు
కుటుంబ పండిత బిరుదు యివ్వాలిప్పుడు.

సెంటుకు పుట్టెడు ధాన్యమైనా తక్కువే
ఇంటికి పుట్టెడు యిద్దరైనా ఎక్కువే !

నేడు సామాన్యుని సంసారం బండి
ఓవర్‌లోడై ఓరగిల పడుతోంది.
ప్రమాదం తప్పాలంటే
వెంటనే చూపాలి ఎర్రజెండా,
మూడు కోణాల ముద్దులమాత్రపు జెండా !

ఆపాలి జననాల బండి
ఇద్దరు పిల్లలు పుట్టగానే
ఇంటికి తగిలించాలి బోర్డు
హౌస్‌ఫుల్ (House full) అని
"కుటుంబం బండి నిండింది" అని.

పిల్లలు కావా లని
నోములూ వ్రతాలూ చేసిన
రోజులు పోయాయి,
ఇద్దరు పిల్లల్ని మాత్రమే కని
ముద్దుగా పెంచ వలసిన రోజులు వచ్చాయి.
పిల్లలు తక్కువైతే పుణ్యం తక్కువా ?

పుట్టిన పిల్లలకు అన్నంపెట్టలేకపోతే
పుణ్యమా ? పాపమా ?

పూరిగుడిసె, కుక్కిమంచం
బక్క చిక్కిన బడుగు యిల్లాలు
పిల్లల మంద ఏడ్పులకుతోడు
ఈగల దోమల సంగీతం
అనారోగ్యం ఒకవైపు
అవిద్య మరోవైపు—

ఇలాంటి సంసారంలోకి
ఎలా దిగుమతి చేస్తావు
ఇంకా ఎక్కువ పసికందుల్ని ?
కుటుంబాన్ని పరిమితం చేసుకొని
ఆనందాన్ని అపరిమితం చేసుకో !
గుంపెడు పిల్లలు, గంపెడు బాధలు !

ఈ బాధలు తొలగాలంటే
"ఒకే పుత్రుడు ఒకే పుత్రిక సిద్ధిరస్తు"
అనడమే నేటి దీవన
వధూవరులకు
వర్ధమాన గృహస్థులకు.

# 12. జీవిత వలయం

ఎందుకు జీవించడం ?
ఉద్యోగాలు చెయ్యడానికి.

ఎందుకీ ఉద్యోగాలు ?
జీతాలు పుచ్చుకోడానికి.

ఎందుకీ జీతాలు ?
కడుపు నింపుకోడానికి.

ఎందుకీ కడుపునింపుకోడాలు ?
జగతిలో జీవించడానికి.

ఎందుకు జీవించడం ?
ఉద్యోగాలు చెయ్యడానికి.

# 13. కొండ వాళ్ళు

కొండల్లో - కోనల్లో
ఎండనకా వాననకా
ఆకులు అలములు అన్నంగా
వేళ్ళు దుంపలు విందులుగా

పండ్లు ఫలాలు పరమాన్నంగా
వెదురుబియ్యం పాయసంగా
జీలుగుకల్లు పానీయంగా
జీవిస్తున్నారు కొండవాళ్ళు.

పశుపక్షులు వాళ్ళ బంధువులు
చెట్లు చేమలు వాళ్ళ స్నేహితులు
వన్యమృగాలతో ఆడుకుంటారు
సెలయేళ్ళతో కలిసి పాడుకుంటారు
కారడవులలో కాపుర ముంటారు
మిన్నుకు మన్నుకు మధ్య
గాలిలా జీవిస్తుంటారు.

నేటి నాగరికతకు దూరంగా
అలనాటి మనిషికి దగ్గరగా
రణాలూ, రాజకీయాలూ
అధికారాలూ, అంతస్తులూ
లేని అడవుల్లో
బ్రతుకుతున్నారు
అమాయకులు కొండవాళ్ళు.

# 14. ఉగాది - ఏడాది

ఊరుకెత్తి వచ్చింది కొత్త ఉగాది,
పరుగెత్తి పోయింది పాత ఏడాది!
ఆమె చేసింది ఏమిటి ?
ఈమె చేయగలిగింది ఏమిటి ?

వింటూనే ఉన్నాం అసహాయుల ఆర్తనాదాలు,
కంటూనే ఉన్నాం పేదల కష్టనష్టాలు!
పాత ఏడాది చేసింది ఏమిటి ?
కొత్త ఉగాది చేయగలిగింది ఏమిటి ?

కొత్త ఉగాది మార్పుతెస్తుందా ?
కొత్త మార్పు కవుల వ్రాతలతో వస్తుందా ?
మారుతుందా మన ఉద్యోగుల దృక్పథం ?
చేరుతుందా హెడ్ క్వార్టర్సుకు ప్రజల మనోరథం ?

ఎక్కడ వేసిన గొంగళి అక్కడేనా ?
ప్రక్కన జరిగే అన్యాయాలను పరికిస్తారా ?
లేక — నిన్నటిని వలెనే
నేటిని కూడా నిద్రమత్తులో గడిపేస్తారా ?

వస్తుంది కొత్త వత్సరం
తెస్తుంది సౌభాగ్యం కుప్ప తెప్పలుగా
అని చెబుతారు మన మహా కవులు!
ఏదీ? చూపండి, ఆ మహాసంపదలు?

సంఘాన్నే మింగేవా రున్నంత కాలం
సంవత్సర మేం జేస్తుంది—కొత్తదైనా, పాతదైనా?
ఏమీ చెయ్యలేకపోతే, ఎందుకీ కొత్తదాని రాక?
ఎందుకీ పండగ (లు)? దండగ (లు)?

కొత్త ఉగాదితో కొంచెమైనా
మనిషి బ్రతుకులో మార్పు రాకపోతే
మన ఉద్యోగుల మనస్సులు మందారాలు కాకపోతే
ఎందుకీ పండగలు? దండగలు?

పరీక్షలలో కాపీలు కొట్టేవాళ్ళు
ఎంప్లాయిమెంటు దేవుళ్ళచుట్టూ తిరిగేవాళ్ళు
వీధుల్లోబిచ్చం అడుక్కునేవాళ్ళు
ఏం మారారు? ఎక్కడవచ్చింది మార్పు?

వాళ్ళంతా అనుకుంటారు
పాతకూ, కొత్తకూ తేడా ఏమిటి అని?

పోనీ—ఓపికపట్టి చూద్దాం అంటే—
ఎంతకాలం? ఎన్ని ఉగాదులు?

ఆమె పోయింది, ఈమె వచ్చింది,
అంతేకదా జరిగింది?
ఆమె ఒరిగించ లేనిది
ఈమె ఒలక బోస్తుందా?

మరచిపోదామా పిచ్చికలలు?
మరచిపోతే, మానవుల మెలా అవుతాం?
మానవ ప్రయత్నమైనా చెయ్యవద్దా?
మార్పుకై మళ్ళీ మళ్ళీ యత్నించవద్దా?

పాత ఏడాది పాఠాలను
కొత్త ఉగాదిలో అమలు పరచాలి,
మనస్ఫూర్తిగా యత్నిస్తే
మార్పు అసాధ్యం కాదు సమాజంలో.

అందుకే—గురుజాడ కవికోకిలతో
కంఠం నిలిపి పాడుకొందాం—
సొంతలాభం కొంత మానుకొందాం!
పొరుగు వాళ్లకు ఇంత తోడుపడదాం!

# 15. వేట

వేట ఒక ఆట కొందరికి,
పనీ పాటూ అదే కొందరికి !
ఉండవు దయాదాక్షిణ్యాలు వేటగాడికి
ఉంటుంది ప్రాణాల మీద తీపి మృగాలకు.

వేటగాని విడ్డూరపు సరదా
అపకారం ఎరుగని మృగాలకు ప్రాణాంతకం,

మృగం కంట నీరు కారితే
ముద్దా వేట గాడికి ?

జంతు జాలం ఏడ్చినా
కర చరణాలు మోడ్చినా
కలుగుతుందా కనికరం కసాయి షికార్లకు ?
చీమ కుట్టినట్లైనా ఉంటుందా వేటగాళ్లకు ?

దారి తప్పిన పక్షులు, మృగాలు
అవుతున్నాయి బలి వేటగాళ్లకు,
తప్పించుకోలేని వాళ్ళకు
ముప్పులు వాటిల్లుతుంటాయి !

కంటికి కనిపించగానే
కాల్చేస్తారు ఠపీ మని !
ప్రాణాలు పోయడం ఒకడికే తెలుసు,
ప్రాణాలు తీయడం అందరికీ తెలుసు !

తెలుసు ప్రాణాలు తీపి అని అందరికీ,
అయితే--
తీసే టప్పుడు ప్రాణాలు తీపి తమవి !
తినే టప్పుడు తీపి యితరులవి !

# 16. ఇంటర్వ్యూ

ఉంచుతాడు ప్రజలను బయట
వస్తాడు ప్రజాసేవకుడు లోనికి
చూస్తాడు ఆఫీసర్లను ప్రజల కొరకు.

''ఆఫీసరు నాకు బాగా తెలుసు
ఆయనకు నేనంటే ఎంతో ఇది
నేను చెపితే కాదనడు ఏదీ'' అని

అంటాడు లోనికి వెళ్లేముందు.
అనుకుంటారు ప్రజలు అదంతా నిజమేనని
ఉంటారు బయట కాచుకొని
ఆ ప్రజా సేవకుని నమ్ముకొని,
అనుకొంటారు సమయమంతా తమగురించే
సమాలోచిస్తున్నాడు అధికారితో అని.

ప్రజా సేవకుడు లోపల ఆఫీసరుతో
పిచ్చాపాటి కబుర్లు మాట్లాడుతాడు
ప్రసంగిస్తాడు ప్రపంచంలోని అన్నిసంగతులూ
బయట కాచుకొన్న ప్రజల గొడవ తప్ప.
అది కావాలని ఇది కావాలని,
అధికారిని అవస్థ పెట్టడం ఎందుకు అని.

అధికారి ఎంతో ఆదరం చూపిస్తాడు
అట్టి ప్రజా సేవకుని పట్ల,
వీలుంటే కాఫీకూడా యిప్పిస్తాడు
ఇంత మంచి వారున్నారా యీ రోజుల్లో అనుకుంటూ.

అధికారికి లేని గుణగణాల గురించి
ఆ ప్రజాసేవకుడు పొగిడేస్తాడు,
నిమిషంలో చెప్పవలసిన విషయం

గంట సేపు చర్చ జరిగినట్లు,
ఆ అమాయక ప్రజల పని
అప్పటి కప్పుడే అయిపోయినట్లు.

చిరునవ్వు ముఖంతో తిరిగి వస్తాడు
అరచేతిలో అవుతున్న పని చూపుతూ
మరు నిమిషంలోనే అవుతుంది మనం వెళ్ళినపని అంటూ.
బరువు తగ్గినట్లు ఆనందిస్తారు
బయట ఉన్న ప్రజలు.
చెప్పాను మీ కష్టాల గూర్చి
విన్నారు వివరంగా
అన్నారు తప్పక చేస్తాను మీ పనులు అని
చూడండి త్వరలో ఫలితం
పిలుద్దాం వారిని ఒక శుభ కార్యానికి
వేద్దాం పూల మాలలు
చేద్దాం టీపార్టీ విందులు-అంటాడు.

అన్నీ అయ్యాక, ఇంతకూ వాళ్ళ పని జరిగితే
అందుకు కారణం ప్రజా సేవకుడే !
పని జరగకపోతే
అధికారి అసమర్థత
ప్రజల దురదృష్టం.

# 17. ఏనాడు - ఆనాడు

ఏనాడు సభలు తగ్గించి
సత్కార్యాలు చేయగలమో –

ఏనాడు ఉపన్యాసాలు కట్టి పెట్టి
ఉపయుక్త కార్యాలకు పూనుకోగలమో –

ఏనాడు పాడిందే పాడడం మాని
కొత్త విషయాలు చెప్పగలమో –

ఏనాడు పొగడ్తలు వల్లించడం మాని
వాస్తవికతను వెల్లడించగలమో –

ఏనాడు కులాన్ని గాక
గుణాన్ని గుర్తించగలమో—

ఏనాడు పదవుల మీద దృష్టి వదలి
చదవులు నేర్చుకోగలమో—

ఏనాడు సర్వజన సమానత్వం చాటగలమో—
ఏనాడు విజ్ఞాన సాగరాన్ని మథించగలమో—

ఏనాడు దుర్బలులను దోచుకోవడం మాని
ఆదరించడం నేర్చుకోగలమో—

ఏనాడు దొంగ వ్యాపారాలు మాని
అసలు ధరలకు సరుకులు అమ్మగలమో—

ఏనాడు ఉద్యోగుల్లో దుర్నీతి నరికట్టి
ప్రజలయందు సానుభూతి చూపగలమో—

ఏనాడు —
అందరికీ చేతినిండా పని

ఉండడానికి గూడు
కుడువడానికి కూడు
కట్టడానికి బట్ట
అందించ గలమో —

ఏనాడు కల్పించగలమో సౌకర్యాలు
విద్యకు, వైద్యానికి —

ఏనాడు బయట పడగలమో
మూఢనమ్మకాల సుడిగుండాల నుండి —

ఏనాడు ప్రజలను నడిపించగలమో
ప్రగతి పథంలో —

ఏనాడు వ్యక్తి వ్యక్తిత్వాన్ని గుర్తించగలమో
ఏనాడు దేశభక్తి సంఘశక్తిగా గమనించ గలమో —

ఏనాడు చెప్పేది చేయగలమో —
ఏనాడు చేసేది చెప్పగలమో —

ఆనాడు చెప్పుకోగలం మనం మనుష్యులం అని !
ఆనాడు తిరగగలం విశ్వ సమాజంలో తల యెత్తుకొని !

# 18. కామెరా క్లబ్బు

విన్నారా—యీ కథ ?
చూశారా యీ చోద్యం ?
కామెరాల కొక క్లబ్బట
ఫొటోల కొక పోటీల పందె మట
గెలిస్తే బహుమాన మట
ఓడితే ఒక కరచాలన మట !

గెలుపు—ఓటమి కాదు ప్రధానం,
పోటీలో పాల్గొనడంలో అందరూ సమానం.

ఫోటోలు తీయడం ఒక అలవాటు
పోటీలు నడపడం ఒక వినోదం.

వేశారీ క్లబ్బు సభ్యులు
ఒక వినోద ఫొటోల యాత్ర
నీలిరంగు సముద్రపు టొడ్డుకు.

చూశా రక్కడ బెస్తవాళ్ళు వీళ్ళను,
అనుకొన్నా రిలా—

ఎవరీ పిచ్చివాళ్లు ?
ఎందు కీ వింత ప్రయాణం ?
నగరంలో పనిలేని వాళ్లా ?
ఎరగం ఎందుకో-సరదా యీ నీళ్లల్లో !

ఫొటోలు తీస్తే పొట్ట గడుస్తుందా ?
తిని కూర్చోలేక ఏమిటీ తిప్పలు ?
తిన్నది అరగడానికి తిరగా లేమో !
మరి లేకుంటే ఏమిటీ పాట్లు ?

ఎగిరే పిట్టలను
మేసే పశువులను
పాడే పడతులను
పనిచేసే పల్లెవాళ్లను
చేపలు పట్టే గోచీ రాయుళ్లను
వీళ్ళనా ! వీళ్ళు తీసేది ఫొటోలు ?

భలే ! ఎంచక్కని పిచ్చివాళ్ళు !

వాళ్ళలా అనుకోవడం న్యాయమే—
వీళ్ళకు తీరిక సమయాల్లో ఏమిచేయాలో తోచదు,
వాళ్ళకు తీరికంటే ఏమో తెలియదు !
వీళ్ళకు వాళ్ళంటే అదొక రోత
వాళ్ళకు వీళ్ళంటే అదొక వింత
వీళ్ళకు మురికి కాలవలే సెలయేళ్ల
వాళ్లకు సెలయేళ్లే మురికి కాలువలు !

వీళ్ళు కామెరా లెన్సు ఎత్తారు
వాళ్ళు నావ తెరచాప ఎత్తారు
వీళ్ళు నదిలో నీళ్ళను ఆనందిస్తారు
వాళ్ళు అందున్న చేపలను అందుకుంటారు
తీస్తారు ప్రాణాలు బొమ్మిడాల చేపలకు
వీళ్ళు తీస్తారు ఫొటోలు వాటి ప్రాణాలకు !

వీళ్ళకు తీరేది క్రీడాతృష్ణ
వాళ్ళకు తీరేది ఆకలి మంట !

కామెరాకు వాళ్ళు వీళ్ళు ఏమిటి ?
ఇదంతా క్లబ్బు సభ్యుల వినోదం,
కామెరాలకు మాత్రం చచ్చినంత పని.
ఇదంతాకలిసి సాగేదే ఫోటోల యాత్ర.

# 19. ఆట - విమర్శ

ఆటను విమర్శించడానికి పోటీలో పాల్గొనాలా ?
ఆటలోని రుచి తెలిస్తే ఆనందించలేమా ?

విమర్శకు విజ్ఞానం ఉండాలి,
విచారించి విమర్శిస్తేనే రుచీ, పచీ.

ఆటలోని లోటుపాట్లు తెలియని విమర్శ
ఆటకు, ఆటగాడికి చేసే అన్యాయం.

ఆమ్లెట్ రుచి చెప్పాలంటే,
గ్రుడ్డు పెట్ట నవసరమా ?

ఆటలోని అందాన్ని ఆస్వాదించా లంటే
ఆట ఆడ నవసరమా?

విజ్ఞానంతో కూడిన విమర్శ
ఆటగాని కెంతో అవసరం
'వేషగాడికి అద్దంలాగ.

ఆటగాడికి ఓటమి, గెలుపు ఒకటే
ఆట ఆడే పద్ధతిలో ఆడితే.
మంచి ఆట ఆడి ఓడినా గొప్పే
చెడ్డ ఆట ఆడి గెలిచే కంటే !

మరువరానిది మరో విషయం —
ఆడడం ఎంత కష్టమో
విమర్శించడం అంత సుళువు.
అందుకనే –
కావాలి ఆటగాడు కొంత విమర్శకు పాత్రుడు,
విమర్శకుడు పొందాలి కొంత మెలుకువను ఆటలో.

తెలిసీ తెలియని విమర్శ
వచ్చీ రాని ఆట!

# 20. చెప్పడం - చేయడం

చెప్పడం సులభం
చేయడం కష్టం.

ఎక్కడం కంటే దిగడం సులభం
ప్రశ్నకంటే జవాబు కష్టం.

చెప్పడం ఎంత తేలిక !

కొందరి కది వినోదం
కొందరి కదొక వెఱ్ఱి.

మరి చేయడమో ?

అది మరొకరి పని,
చెప్పేవారి పనికాదు !

చెయ్యక పోయినా
చెయ్యలేక పోయినా -

కయ్యం కలుగవచ్చు
నెయ్యం తప్పవచ్చు
విమర్శకో, శిక్షకో పాలు గావచ్చు.

చెప్పకపోతేనో— —

చాలా మంచిది
చెప్పేవారికి
వినే వారికి కూడా !

చెప్పడం ఎంత సుళువో
చెయ్యడం అంత కష్టం.

# 21. అలవాట్లు

అలవాట్లు సిల్కుదారాలు అసల్లో,
కొంత కాలానికి అవుతాయి నులకతాళ్ళు,
అటు పిమ్మట గట్టిపడతాయి ఉక్కు పగ్గాలుగా.

సిల్కుదారం తుంచడమెంత సుళువో
ఉక్కు పగ్గం తెంచడమంత కష్టం,
చెట్టై వంగనిది మానై వంగుతుందా ?

చిన్న అలవాట్లు సిల్కుదారాలు,
పాతుకు పోయినవి ఉక్కుపగ్గాలు.

సిల్కుదారం తెగకపోతే
ఉక్కుపగ్గం తెగుతుందా ?

అందుకనే—

మంచి అలవాట్లను పెంచుకోవాలి మొదట్నుంచీ,
చెడు అలవాట్లను తుంచుకోవాలి అసల్లోనే.

మరో మాట—

అలవాట్లు అవాలి సేవకులు మనకు,
కారాదు మనం దాసులం అలవాట్లకు.

## 22. మంచి - చెడు

మంచీ-చెడూ కావడి కుండలు
చీకటి వెలుగులు
చెడు వుంటేనే మంచికి అర్థం
చీకటి వుంటేనే వెలుగుకు వినియోగం.

కుడిఎడమల కుండలు వుంటేనే కావడి
చెడే లేకుంటే మంచికి మరో అర్థం వుండేది
చీకటే లేకుంటే వెలుగుకు విలువే లేదు
చేదు లేనిదే తీపి ఎలా తెలుస్తుంది ?

రాముడు మంచి
రావణుడు చెడ్డ
కాకి నలుపు
కొంగ తెలుపు
జిలేబి తీపి
వేప చేదు...

అని పోలిస్తేనే
మంచికీ, చెడ్డకీ

అర్థం
విలువ.

''మంచికి కొలబద్ద''—చెడు
''చెడు''కు కొలమానం—మంచి.

# 23. ఉపాధి

పాఠాలు నేర్పని చదువులు
పనికిరాని విద్యలు
వల్లమాలిన ఖర్చులు
ఎల్లవేళల బాధలు
(మళ్ళీ మళ్ళీ అనేక బాధలు)

బియేలు చదివినా, బియి డిగ్రీలు పొందినా,
ఎమ్మేలు చదివినా, ఎమ్ బి బియస్ పట్టాలు పొందినా —

కష్టపడి పనిచేయనిదే
కాళ్ల చేతులు కదపనిదే

వస్తుందా నెలజీతం ?
గడుస్తుందా జీవితం ?

నాగలి మంచిదైతే
దున్నగలదా తనకై తానే ?

పార గట్టిదైనా
త్రవ్వగలదా స్వయంగా తనకై తానే ?

డిగ్రీలు పంక్తుల పొడవున్నా
తెచ్చి పెట్టగలవా నెలజీతాలు ?

కావాలి కావాలి అంటాము అభివృద్ధి,
శరీరాన్ని వంచి శ్రమిస్తే రాదా అభివృద్ధి ?
కుర్చీపై కూర్చొని కట్టలు కట్టలు రాసేస్తే
వస్తుందా అభివృద్ధి ?
సభల్లో వుపన్యాసాలు దంచేస్తే బైటపడుతుందా అభివృద్ధి ?

పనిచేసే దొక్కరు, పంచుకు తినేది పదిమంది,
సంపాదించే దొక్కరు, సంతర్పణకు చాలామంది !

దినాని కున్నాయి ఇరవై నాలుగు గంటలు,
ఆరు గంటలు హాయిగా నిద్రించు
మరో ఆరు గంటలు మన సరస సల్లాపాలకు,
మిగిలిన పన్నెండు గంటలు ఏమిచేస్తున్నాం ?
పోస్తున్నాం బొగ్గుల పొయ్యిలో !

చూస్తున్నాం జపాను, జర్మనీలను,
నేర్చుకుంటున్నామా బ్రతుకు తెరువు పాఠాలను ?
మనం మనుషులమా ? రబ్బరు బొమ్మలమా ?
ఉపయోగించాలి మన శక్తిని బలిమిని
ఉపాధి కల్పించుకోవాలి స్వయం కృషితో.

కండ బలిమి కలవాడు కూడా
ముందు కొస్తాడు ముష్టి చిప్పతో !

పని చేసుకొని బ్రతకవయ్యాలంటే - -
"ఎక్కడుంది బాబూ పని" అంటాడు గ్రుడ్డివాడిలా !

పని వుంది చెయ్యమంటే
భగ్గున మండి పడతాడు
ముష్టివాడి నుండి
పొట్టు గ్రాద్యుయేటు వరకు !

ఉపాధి కోసం పని చెయ్యడు మూర్ఖుడు !
పని చెయ్యకుండా ఉపాధి లేదని గుర్తించడు !
పని చెయ్యి ! పనే దేవుడు !
పని చెయ్యకుండా దేవుడు కూడా బ్రతకలేడు !

# 24. అందం - ఆనందం

అందంలో ఉంది ఆనందం
ఆనందంలో అంతా అందం.

రక రకాల గులాబీలు
రంగు రంగుల సీతాకోక చిలుకలు

తెల్లని మొగ్గలతో నిండిన మల్లెపొద
వన్నె వన్నెల పింఛము విప్పిన నెమలి
రమణీయమైన ముద్దుల రామచిలుక
చల్లని వెన్నెల వెదజల్లే పున్నమ చంద్రుడు.
నీలి మబ్బులలో తేలియాడే ఆకాశం
గాలి వానలో మేలి ముసుగుల ఇంద్రధనుస్సు
పసిపిల్లల తడబడే పలుకులు
పూబోడుల చిరునవ్వుల పువ్వులు
సెలయేరుల సరిగమల సంగీతం
మలయమారుతాల మధురిమల నాట్యం
అందాలకు ఆకారాలు కాదా !
ఆనందాలకు ప్రాకారాలు కాదా ?

అందంలో ఉంది ఆనందం,
ఆనందంలో ఏదైనా అందం !

# 25. సంఘం - మనం

మనం మనమే
బ్రతికివున్న మనుషులం,
మరి సంఘమో
బ్రతికి వున్న మనుషులతో నిండిన శవ పేటిక !

మన బ్రతుకులపై
ఆ శవపేటిక పెత్తనం !

నిల్చోడానికి దాని ఆజ్ఞ
కూర్చోడానికి దాని అనుమతి !
పెళ్లికి, పురిటికి, అన్నిటికీ అదే
కాళ్లకి బంధం—కళ్ళకి గంత.

ఆకలి దప్పులు తీర్చదు
కష్టాల్లో ఓదార్చదు
సుఖాల్లో వుండనివ్వదు.

మనిషి కొక్క నీతి
ప్రతి మనిషికీ ఒక్క నీతి
వున్న వారి కొక నీతి
లేని వారికి మరొక నీతి.

ఉన్న వా రేమిచేసినా ఒప్పే !
లేనివా రేమి చేయకున్నా తప్పే!
ఈ జబ్బు చిన్న వాళ్లలోను పాతుకున్నది.
తాము తప్పుచేస్తే గొప్పముప్పే అనుకుంటారు.
గొప్పవా ళ్లేది చేసినా ''చెల్లుతుంది'' అంటారు.

అంటే—
గొప్పవాళ్ల తప్పులకు
చిన్నవాళ్ల అర్థంలేని అనుమతి !

అడుగంటిన వారిని అణగద్రొక్కడం ఒక గొప్ప !
అమాయకులను మోసగించడం ఒప్ప !

"అన్యాయాన్ని ఎదుర్కొని
న్యాయాన్ని నిలబెట్టాలి" అంటే—

"అబ్బో వాండ్ల దెబ్బకు ఎదురే ?
ఆ కొండ రాయళ్లతో
ఈ ఇసుక రాయళ్ళు పోటీయే" ? అంటారు.
పెద్దలది ధనంతో చెక్కిన ఇనుపగుండె, సిమ్మెంట్ దిమ్మె—
పేదలది మట్టితో మలిచిన పచ్చి ఇటుక !

ఇక ఈ సంఘంలో—
అన్యాయం ఆగే దెప్పుడు ?
న్యాయం నిలిచే దెప్పుడు ?
ఎప్పుడా ?

మనం ఈ శవ పేటికనుండి బయట పడ్డప్పుడు,
ఇసుక గుండెను రాతి గుండెగా చేసుకున్నప్పుడు.

# 26. పొరుగింటి పుల్లకూర

ఎంత కమ్మని రుచి
పొరుగింటి పుల్లకూర !

ఎంచేత ?
తమది కాదు గనుక
ప్రక్క యింటిది అవును గనుక !

పక్కింటి వాళ్ల ఇళ్ళు పరిశుభ్రం
తమ ఇళ్ళు మురికి కూపం

వాళ్ళ పిల్లలు సద్గుణ సంపన్నులు
తమ సంతతి అల్లరి మూక

వాళ్ళ భార్యలు అందాల భరిణలు
తమ పెండ్లాలు మర్కటాలు

వాళ్ళ భర్తలు నవమన్మధులు
తమ మొగుళ్ళు అభినవ కుంభకర్ణులు

ప్రక్కింటి కాఫీ 'పారిస్ మేక్,' నెస్ కేఫ్
తమయింటి కాఫీ మిరియాల కషాయం

ప్రక్కింటి వాళ్ళు వాడేది విలువైన సీమ సరుకు
తాము ఉపయోగించేది సాధారణ నాటు సరుకు

వాళ్ళ భాష నాజూకు పదజాలం
తమవి వట్టి ఎబ్బరికపు మాటలు

ఆవిడ నవ్వితే పున్నమ వెన్నెల
ఈవిడ నవ్వితే అమవస నిశి

వాళ్ళమాటలే పాటలై వినిపిస్తే
వీళ్ళ పాటలే మాటల్లా గుండవు.

ఎంత ఘాటైన తాలింపు పక్కింటి పుల్లకూర !
ఏమిటో అందులోని రహస్యం ?

పరుల సొమ్ముపై ఆశ !
పక్కింటి మసాలా పాకం
ఊరికే రుచిచూడాలనే మోజు !

# 27. కర్ణుడు

కర్ణా ! నినుమించిన వీరు డున్నాడా?
కలకాలం లోకం నిను వినుతింప వలదా ?
నిజాయితీలో నిను జయించిన వాడు లేడు
నీవులేక దాతృత్వం-వీరత్వంలేవు.

తల్లికి కొడుకువుగాక—
తమ్ములకు అన్నవుగాక—
అన్నమాట నిలబెట్టుకోడానికి
ఎన్ని కష్టాలైనా భరించావు కదా !

ఎన్నో దానా లిచ్చిన వా రున్నారు
కానీ, తన శరీర కవచాన్నే
దాన మిచ్చే ఘనత దక్కింది నీకే.
శత్రువు కూడా అడిగింది
యిచ్చావు కా దనక.
ధర్మాన్ని పాటించి నిలపడానికి
కొలిచావు దుర్యోధనుణ్ణి కూడా.

వీరుల్లో వీరుడవై
యోధుల్లో యోధుడవై
నమ్మిన వారికి ద్రోహం
నా వల్ల కాదంటూ
నీతికోసం నిలిచావు
సిసలైన రాచబిడ్డవై
అసువులు అర్పించావు
కీర్తి గడించావు.

నీవు లేక భారతయుద్ధం లేదు.
అయినా నీవు కోరలేదు యుద్ధాన్ని.

ప్రతాపం నీది, పేరూ ప్రతిష్ఠా పార్థునిది.
కష్ట మొకరిది, ఫలితం మరొకరిది.
కృష్ణపరమాత్మ కూడా ఆపలేక పోయాడు
ఆదినుంచీ జరుగుతున్న యీ అన్యాయాన్ని.

పాండవ కౌరవ సమరం
కర్ణుడికి, పార్థుడికి యుద్ధం.
అధర్మంగా అర్జునుడు నిన్ను చంపినా
అంధలోకం అనుకుంటున్నది
కీర్తి అర్జునుడిదే అని.

తప్పుచేసిన వారిదే గొప్ప
గెలిచిన వారే ధర్మాత్ములు
అని తలచే విపరీత లోకాన్ని చూసి—
విచారించకు, కర్ణా !
నిజానిజాలు తెలిసిన విజ్ఞానులు
ని న్నెన్నడూ విస్మరించరు.

ఆచంద్రార్కం నిలిచే
నీ కీర్తి ఎన్నటికీ మిన్నయే !
నిను గన్న తల్లి ధన్యురాలు !
నిను గన్నదేశం దివ్యభూమి !

# 28. ఆశే ఈశ

ఆశకు అసలూ, కొసా లేవు
హద్దులు, పద్దులు అసలే లేవు.
అందుకోవా లంటుంది ఆశ అన్నింటినీ
అందుకు తగిన శక్తి
ఉన్నా---లేకున్నా !

ఆశ అనే పాశానికి
అంతంలేదు హనుమంతుని తోకలాగ.
అంటారు "అందని పండ్లకు అఱ్రులు చాచడం ఆశ" అని
అందే పండ్లకు చాచనే అక్కర్లేదుగా ?

అందిన వాటిలో ఆనందం తక్కువ.
అందని వాటిని
అందరూ పొందలేని వాటిని
ఆశించి, యత్నించడంలో ఉంది ఆనందం !

శక్తి ఉన్నా-లేకున్నా
ఒక లక్ష్యాన్ని సాధించా లన్న ఆశ
ప్రగతికి ప్రాణం పోస్తుంటుంది.

అందనంత మాత్రాన వదిలేస్తే
అన్నీ చేదు పళ్ళే అవుతాయి.
ఎద్దులు లేని బండి ప్రయాణం
బుద్ధిలేని ఆశ అనిపించింది ఒకనాడు.
వేల మైళ్ళ నుండి గాలిలో మాట్లాడడం
మంత్రగాళ్ళ చింతకాయలు అనిపించింది ఆనాడు.

అంతెందుకు—
మొన్నటి దాకా
చందమామను చేరుకోవడం
చంటి బిడ్డ కుంటి ఆశ అనిపించ లేదా ?

ఆ ఆశే లేకుంటే
అందని వాటికి అలా అర్రులు చాచకుంటే
నేటి రైళ్ళు, గడియారాలు
టెలిఫోనులు, టెలివిజన్లు
ఆకాశవాణి, అంతరిక్షయానం
అస లుండేవా ?

అందుకనే ఆశను చంపవద్దు.
ఏ దున్నా లేకున్నా
ఎన్నడూ మానుకోవద్దు—
ఆశను పోషించడం.

అందుతుందా లేదా అన్న ఆలోచన వీడి
అందుకోవా లన్న ఆశే—
అందరూ పొందలేని వాటిని
పొందా లన్న ఆశే—
అందరు మానవుల్నీ నడిపిస్తున్న ఈశ !

# 29. దుఃఖం

మనసులో దాచుకోలేని కష్టాలు
మాటల్లో చెప్పుకోలేని బాధలు
అర్థం కాని ఆవేదనలు
గంగా తరంగాల లాగ
పొంగివచ్చే ఆవేశమే దుఃఖం.

కన్నీరు కార్చగానే
కలుగుతుంది ఉపశమనం.

కాని—
ఏడిస్తే వస్తుందా పోయిన వస్తువు ?
ఎంత కన్నీరైనా తెస్తుందా పోయిన ప్రాణం ?

చింతిస్తే తిరిగి వస్తుందా
చేజారిన సుఖం ?
దుఃఖించడం మనోదౌర్బల్యం,
అందువల్ల లాభంకంటే నష్టమే ఎక్కువ.

సుఖం మాత్రం ఎరిగిన వారు
మానవులా ? దేవతలే !
సుఖ దుఃఖాలు సూటిగా
అనుభవించే వారే మానవులు.

దుఃఖానికి కారణాలు అనేకాలు —
తలకు మించిన తలపులు
తీర్చుకోలేని కోరికలు
హద్దులులేని ఆశలు-ఆరాటాలు-ఆవేశాలు
దగ్గరి వారి మరణాలు
దూరపు వారి సుఖాలు!
దూరంగా ఉంటే వీటన్నిటికీ,
దుఃఖాలు రావు దగ్గరికి.

దుఃఖాలు లేకపోవడమే సుఖం,
దుఃఖించక పోతే మానవుడు
అవుతాడు దేవుడే.

# 30. ప్రయాణం

ప్రయాణ మొక పరమానందం
అందులోని రహస్యాన్ని అందుకొంటే.
లేకుంటే పరమ బోరు.

కళ్ళు విప్పి చూస్తే అంతా వింతా, వినోదం.
పచ్చని బయళ్ళు-పక్షులు, వృక్షాలు
చెట్లు-గుట్టలు
కొండలు-కోనలు
లోయలు-లోతు కాలువలు
పల్లెలు-పట్టణాలు
పరిశ్రమలు-పశుగణాలు.

"ఇవే కదా ఎక్కడకి వెళ్ళినా
ఇంతేగదా ఎటు చూసినా"
అనుకుంటే, ప్రయాణం
గ్రుడ్డివాడికి ఏనుగును చూపినట్లే,
చెవిటి వాడికి శంఖం ఊదినట్లే.

చెట్టుకూ చెట్టుకూ ఉన్న భేదం
గుట్టకూ గుట్టకూ ఉన్న తారతమ్యం
పక్షికీ పక్షికీ ఉన్న తేడా
తెలుసుకున్నప్పుడే
తెలుస్తుంది ప్రయాణంలో ఉన్న పసందు.

గంగగోవుపాలు, ఖరము పాలు
ఉప్పు, కప్పురము
ఒక్కలాగే ఉంటాయి కనుక
ఒక్కటే అనుకుంటే
ప్రయాణం చేయడం పరమ దండుగ.

చల్లగాలి వీస్తే భరించలేని వారు
దుమ్ము లేస్తే ఆగలేని వారు
ఆకలేస్తే కేకలేసే వారు
ప్రయాణానికి పనికిరాని
గుడ్డివారు, కుంటివారు,
మూగవారు, చెవిటివారు!

వైవిధ్యం జీవితానికి ప్రాణం,
ప్రాణానికి ప్రాణం ప్రయాణం! ✓

# 31. నవ్వు

నవ్వులో ఉంది అందం
నవ్వులో ఉంది ఆనందం
నవ్వు చీకటిని చీల్చే శూలం
నవ్వు వెలుగుకు వెన్నెలకు మూలం.
చిరునవ్వు రోగికి దివ్యఔషధం
నవ్వు భోగికి నందన వనం.

సీసా నిండా మందునీళ్ళు
డబ్బా నిండా మందుబిళ్ళలు
సాటిరావు ఒక నర్సు చిరునవ్వు ముందు.

నవ్వులు పువ్వులై
స్నేహం దివ్వెలై

లోకంలో వెలిగితే
లోపం లేదు దేనికీ.

కాని —
నిర్భాగ్యులను చూసి
నిస్సహాయులను చూసి
  శ్రామికులను
  బాధితులను
  చూసి నవ్వితే
అది నవ్వుకాదు నాగుబాము,
అది పువ్వుకాదు పులికోర.

ప్రాణాలను తీస్తాయి కొన్నినవ్వులు
ప్రాణాలను పోస్తాయి మరికొన్నినవ్వులు.
విషపు నవ్వులు
వికటపు నవ్వులు
ఇస్తాయి వికృత ఫలితాలు.

నవ్వుకు ఖర్చులేదు
నవ్వితే నష్టంలేదు
నవ్వు, నవ్వించు లోకాన్ని !
నవ్వులతో కవ్వించు నాకాన్ని !

# 32. దొరగారి దర్శనం

అధికారంలో వున్న దొరగారి దర్శనానికి
అవసరా లున్న యెవరెవరో వస్తారు,
తెస్తారు యేవేవో అర్జీలు.

ఆఫీసు జవాన్ను చేసుకుంటారు అనుకూలం,
వ్రాస్తారు చీటీ - ఊరూ, పేరూ తెలుపుతూ.
పేరుస్తాడు జవాను చీటీలను ఉపాయంగా,

వరుసక్రమంగా పిలుస్తాడు అధికారి.
వస్తారు "నమస్తే" అంటూ లోనికి,
ప్రయోగిస్తారు ఆఫీసరు మీద
పొగడ్తల సమ్మోహ నాస్త్రాలను.

"ఇది మీరు ఎంత గొప్పగా చేశారు!"
"అది మీరు లేకుంటే జరిగేదికాదు!" అంటారు.
''మీరు ఇంద్రులు, చంద్రులు'' అని అనరు గాని
"అందరూ అనుకుంటున్నా"రని అంటారు.

చెపుతూ పోతారు లోకాభిరామాయణం
దాస్తారు అసలు విషయం ఆఖరు దాకా.
చెప్పండీ వచ్చిన పని అంటే –
"అబ్బే, పనేం లేదండీ !
తమ దివ్యదర్శనం చేసుకోవా లని" అంటారు.

తెలివిగా విందుకు పిలుస్తారు,
తమ విరోధులను ఆఫీసరు విరోధులుగా చూపుతారు.

పిలుస్తారు ఏదో ప్రారంభోత్సవాలకు,
ప్రవర్తిస్తారు తామే సత్యసంధు లైనట్లు

వేస్తారు పూల మాలలు
తీస్తారు ఫొటోలు
చేస్తారు ఉపన్యాసాలు
మెల్లగా విప్పుతారు కోరికల పంచాంగం !

''పెట్టాము మీ పేరు మా కాలనీకి
వెంటనే పట్టాలు ఇవ్వండి'' అంటారు.
తమకు కావలసింది ఊరందరికీ కావలసినట్టు,
తమకు కిట్టనివాళ్ళు అభ్యుదయనిరోధకు లయినట్టు,
చిత్రవిచిత్రంగా చిత్రిస్తారు !

మసిపూసి మారేడుకాయ చేస్తారు—
వినేవాళ్ళకు చెవులు లేనట్టు,
చూసేవాళ్ళు గుడ్డివాళ్ళయినట్టు !
వీలైతే వలలో పడవేసుకొంటారు
(కాకుంటే--పడతారు కాళ్ళా—వేళ్ళా!)

అమాయకంగా కనిపించే అభ్యర్థనల వెనకాల
దాగివుండే మాయమర్మాలను పసిగట్టి
జాగ్రత్తగా మసులుకోవాలి దొరగారు !
లేకుంటే, బురదలో పడతారు !

# 33. సిగ్గు

చిన్న వయస్సులో సిగ్గు కొందరికి,
అన్ని వయస్సుల్లో సిగ్గు మరికొందరికి.
పూ మొగ్గల్లాగ
సిగ్గులు పలు రకాలు.

పెద్దలను చూస్తే - పిన్నలకు సిగ్గు
తరుణులను చూస్తే—తాతలకు సిగ్గు

ముద్దంటే—ముగ్ధలకు సిగ్గు
వరుడంటే—వధువులకు సిగ్గు
ప్రేమంటే—ప్రియులకు సిగ్గు
అత్తవారి పట్ల కొత్తకోడళ్ళకు సిగ్గు
కొత్తవాళ్ళను చూస్తే కొందరికి సిగ్గు
యువకులను చూస్తే యువతులకు సిగ్గు.
యవ్వనమే ఒకసిగ్గు యువతీ యువకులకు !

తప్పు చేస్తే కొందరికి సిగ్గు
మంచి చేయలేకపోతే మరికొందరికి సిగ్గు
పెన్నిధి పోతే కొందరికి సిగ్గు
పేరుప్రతిష్ఠలు లేవని కొందరికి సిగ్గు
మానం పోతే మనిషికి సిగ్గు
మాట తప్పితే మరీ సిగ్గు.
సిగ్గుల్లో సిగ్గు—
చెలి బుగ్గల్లో సిగ్గు !

అందంలో, ఆనందంలో
అన్నిటికన్న సిగ్గుదే మొగ్గు.
సిగ్గే సింగారం
సిగ్గే బంగారం
శృతి మించితే మాత్రం అంగారం!

# 34. నడి రోడ్డులో

ఒంటికీ, రెంటికీ అనీ
కాలకృత్యాలకు అనీ
చెంబుపట్టుకు పోతున్నా ననీ
ఏరుకు పోతున్నాననీ
దొడ్డికి అనీ
బయటికి అనీ
మర్యాద కరమైన
పర్యాయపదాలు వాడుతాం—
వేటికి ?
బ్రతుకు యంత్రం నడపడానికి
అత్యవసరా లైన మలమూత్రాలకు !

ఆ మలమూత్రాలను
ఆ చెప్పరాని చెడ్డవాటిని మాత్రం
నడిరోడ్డుమీద విసర్జిస్తాం !
మర్యాద అక్కడ మాత్రం విస్మరిస్తాం !

''మలమూత్రాల చోట్లు'' అని
మన ప్రభుత్వంవారూ

మర్యాదగల మునిసిపాలిటీ వాళ్ళు
కట్టిన పాయిఖానాల్లో తప్ప—
తక్కిన అన్నిస్థలాల్లోనూ చేస్తాం మలవిసర్జన !

కొంచెం కనుమరుగైతే చాలు
కొంచెం మసక చీకటి కమ్మితే చాలు
రోడ్లన్నీ మరుగుదొడ్లే అయిపోతాయి !
నోటితో కూడా చెప్పరాని
మలమూత్రాలు —
ముంగిళ్ళలో
మూల మలుపుల్లో
వీరవిహారం చేస్తాయి !

మన వాళ్ళు ఆత్మవంచనకూ
అపరిశుభ్రతకూ జంకరు.

చేతనైన మంచిని కూడ చేయలేని
చేతకాని వాళ్ళం మనం.
పైకి చెప్పం కాని——మనం
బయట ఏమైనా చేస్తాం !
బూతు మాటలే మనకు నిషేధం,
బూతు పనులు కాదు !

బారులుతీరి బాటల వెంబడి
చెంబులు పట్టుకొని
ఛండాలంగా కాలకృత్యాలు తీర్చుకొనే
భారతీయులను
విదేశీయులు చూస్తూ
విస్తుపోయి చస్తుంటారు !

ఇండియాకు ఇంగ్లండు కన్న
ఎందులో ఉన్నా లేకున్నా
ఈ విషయంలో మాత్రం గొప్పతనం
ఉన్నది అంటారు కొందరు.

ఇండియాలో భోజనం లోపల చేస్తారు,
మలవిసర్జన బయట చేస్తారు.
ఇంగ్లండులో భోజనం రోడ్ల వెంబడి చేస్తారు,
మలవిసర్జన మాత్రం
అంతఃపురాలలో చేస్తారు.

మలమూత్రాల విషయంలో
మనం ఎంతో ముందున్నా మని
నడివీధిలో బిడియం లేకుండా
నలుముఖాలా ప్రకటించాలా ?

# 35. నిజం కాని నిజం

"ఇది నిజం
అది నిజం
నేను చెప్పేది నిజం
నేను చేస్తాను అలా, నిజం !"

అని కొందరు అంటారు—
అదంతా మనల్ని నిజం అనుకొమ్మన్నట్లు,
నిజం చెప్పే ధైర్యం వారికి ఉన్నట్లు.

నిజానికి అదంతా అబద్ధం,
అంతకు మించిన అబద్ధం లేదు—నిజం.

నిజం చెప్పక పోవటం
అబద్ధ మాడాలని కాదేమో !

అబద్ధాలు ఆడటం
నిజం చెప్పకూడదని కాదేమో !

నిజంగా నిజం చెపితే నమ్మే దెవరు ?
నమ్మినా అందుకు సంతోషం చిమ్మే దెవరు ?
అబద్ధానికి ఉన్న విలువ
నిజాని కెన్నడూ లేదు,
ఈ నా డసలే లేదు !

అందమైన అబద్ధా లాడడం
అందరూ నేర్చుకుంటున్నారు.
నిజం చెప్పి నిష్ఠురం తెచ్చుకోకుండా
అబద్ధాలు చెప్పి అందలా లెక్కుతున్నారు.

''ఆడవాళ్ళ మాటలకు అర్థాలే వేరులే''
అని మగవాళ్ళు అంటే
"మగవాళ్ళ మాటలకు అర్థాలు మారులే"
అని ఆడవాళ్ళు అంటారు.

"అన్నంతిని వెళ్ళకూడదా ?
భోజనానికి రాకూడదా ?"

అని ఆడవాళ్ళనా, మగవాళ్ళనా
రమ్మని అన్నట్లు అగుపించే నిజంలో
"రావద్దండీ" అన్న అబద్ధం దాగుకొని లేదా ?

''ఉంటారా కొన్నాళ్ళు ?
మళ్ళీ ఓసారి రాకూడదూ ?''
అంటే కూడా అర్థమేమిటో
నిజంగా మీకు తెలియదంటారా ?

''మీ రెంత మంచివారు !
మీ రెంత బాగుంటారు !''
అని ఎవరైనా అంటే పొంగిపోతాం,
కాని, అది నిజం కాదని తెలిసినా
అబద్ధం అనుకొని క్రుంగిపోం.

లోకం పోకడను బట్టి
సమ యాసమయాలను బట్టి
పొగడాల్సి వస్తుంది
నిజంగా అబద్ధం చెప్పాల్సి వస్తుంది
నిజం ధర్మమైతే
అబద్ధం ధర్మసూక్ష్మం మరి !

# 36. కనిపించని కారణాలు

కారణం లేంది కార్యం లేదు
కార్యం వెనుక ఏదో కారణం ఉంటుంది.
గాలి వీచందే గడ్డిపోచైనా కదలదు
నిప్పు లేనిదే పొగలేదు
వెలుగు లేనిదే నీడ లేదు.

ఈగైనా వాలందే
లేగ తోక ఆడించదు,
చిన్న చీమైనా ముట్టందే
శిశువు ఏడవదు.

అయితే—
కారణం లేకుండానే ఎన్నో
కార్యాలు జరుగు తున్నట్లు
కనిపిస్తుంది మనకు తరచు.

పాప మెరుగని కులస్త్రీని
కులటగా నిందిస్తుంది లోకం ఒకప్పుడు.
పీస మెత్తు దోషం ఎరుగని
నీతిమంతుడైన ఉద్యోగి మీద
అవినీతి అభియోగం మోపబడుతుంది
అనేక సందర్భాల్లో.

ఇలా మంచివారికి చెడుపేరు రావడానికి
ఏమిటి కారణా లంటారా ?
అసలు విషయం విప్పి చెపితే
సానుభూతితో వింటారా ?

అసూయ, ద్వేషం
చేతగాని తనం, మోసం—
మంచిని చూడలేని వారి కళ్ళల్లో
మంచిని చేయలేని వారి మాటల్లో
వెర్రితలలు వేస్తాయి
మసిబూసి మారేడుకాయ చేస్తాయి.

వీరేశలింగం, చిలకమర్తి—ఇద్దరికీ కలిపి
ఒక కీర్తి చిహ్నాన్ని కడదా మని ఎవరైనా అంటే
అసూయాపరులకు గిట్టదు
అట్టి సత్కార్యం చేసేవాడికి
అమాంతం కీర్తి వస్తుందని వాళ్ళ భయం!

మనం చెడ్డవాళ్ళ మైతే
మరొకణ్ణి చెడ్డవాడుగా చిత్రిస్తాం,
దానివల్ల మనం ఒంటరిగా ఉండవలసిన పని వుండదు.
జారుడు ఏ స్త్రీనీ శీలవతిగా చూడలేడు.
లంచగొండి ఏ తోటి ఉద్యోగినీ
శీలవంతుడుగా సహించలేడు.
తెలిసినా, తెలియకపోయినా
ప్రతికార్యం వెనుక కారణం ఉండే ఉంటుంది,
అది ప్రకృతిలోనే ఉంది.

# 37. జీవితం

జీవితం రెండు భాగాలు
ఒకటి అనుభవించడం,
మరొకటి ఇతరులకు బోధించడం.

ఆహారం, నిద్ర, మైథునం
జీవిత త్రికోణం.
వాటికోసం పాటుపడడం
వాటిని రెగ్యులేటు చేసుకోవడం
మానవుని జ్ఞానం, విజ్ఞానం.

స్త్రీ పురుషులతో మొదలౌతుంది
జీవిత కావ్యం.
అన్ని రసాలకూ ఇందులో ఆస్కారం ఉన్నా
దుఃఖం అడుగడుగునా బందాలు వేస్తుంది,
శృంగారం కోసం జీవి లొట్టలు వేస్తుంది.

జీవితం ఒక ప్రవాహం
సుఖదుఃఖాలు దాని రెండు తీరాలు

ఒకే ఒడ్డును ఒరుచుకొని
ఏ జీవితమూ ప్రవహించలేదు.

అనుభవాన్ని జీర్ణించుకుంటూ
అందరాని ఆదర్శాల వైపు ప్రవహిస్తూ
అదృశ్యమై పోతుంది
అనంత మృత్యు సాగరంలో.

మంచి చెడ్డల పడుగు పేకల
అల్లికే జీవితం—
బాల్యంలో
యవ్వనంలో
ఆఖరు దశలో.

"జీవిత మొక ముళ్ళ బాట
ఎంత త్వరగా దాటితే అంత మంచిది"
అంటారు వేదాంతులు.

జన్మించడం మరణించడం తప్పుకోలేం
మధ్యకాలాన్ని అనుభవించడం తప్ప!
ఆలోచిస్తే, అయిపోయిన జీవితం ఒక స్వప్నం,
రాబోయే జీవితం ఒక ఆకాంక్ష!

# 38. ప్రేమ

ప్రేమ ! ఎంత ప్రియమైన మాట !
అక్షరాలు రెండైనా - ఎన్నో అర్థాల మూట !
ప్రేమకు అర్థం మారుతుంది
ప్రేమించే వాళ్ళను బట్టి.

తల్లితండ్రుల ప్రేమ
ఎల్లలు లేని ప్రేమ.

పిల్లల ప్రేమ
కల్లా కపటం లేని ప్రేమ.

భార్యా భర్తల ప్రేమ
బరువైన ప్రేమ.

దేవుడి భక్తుడి ప్రేమ
దివ్యమైన ప్రేమ.

అన్నదమ్ముల ప్రేమ
అందీ అందని ప్రేమ.

అక్కా చెల్లెళ్ళ ప్రేమ
అంటీ అంటని ప్రేమ.

ప్రణయ జీవుల ప్రేమ
పవిత్రమైన ప్రేమ.

స్నేహితుల ప్రేమ
చెప్ప నలవిగాని ప్రేమ.

ప్రజా నాయకుల ప్రేమ
పాలపొంగు ప్రేమ.

పేదల ప్రేమ
పేరు లేని ప్రేమ.

ధనికుల ప్రేమ
ధరగట్టే ప్రేమ,

ప్రేమకు కరగని హృదయం
పెంకు కన్నా, రాయి కన్నా హీనం!
ప్రేమించే దేవుడికి ప్రతిఫలం
నిరంతరం ఆయన్ని ప్రేమించడమే!

ప్రేమ చేస్తుంది లోకాన్ని
భూతల స్వర్గం,
ప్రేమ లేకుంటే స్వర్గం
ద్యోతల నరకం.

ప్రేమలేని చోట
భయం రాజ్యం చేస్తుంది.

మనిషి మీద నమ్మకం లేకుంటే
మనిషిని ప్రేమించలేం.
అయితే—
ప్రేమిస్తేనే గాని
మనిషిని మనిషి నమ్మడు.

నిజమైన ప్రేమ గుణాలనే చూస్తుంది.
నిజమైన భక్తులు—
దేవుని గూర్చి తెలిసినవారు కాకపోవచ్చు—
కేవలం దేవుణ్ణి ప్రేమించే వారే అవుతారు!

జీవిత సాఫల్యానికి
కాదా ప్రేమ కిరీటం?

# 39. శ్రీరంగ నీతులు

శ్రీరంగ నీతులు
చెప్పే దెవరికి ?
ఎవరికి ! ఎవరికి ! యింకెవరికి ?
చెప్పేవారికి కాదని
ఎదుటివారికి మాత్రమే అని
వేరే చెప్పాలా ?

శ్రమ ఫలితం
చెందే దెవరికి ?
శ్రమపడే వారికి కాదని
చెమటోడ్చే వారికి కాదని
వేరే చెప్పాలా ?

విద్య, వైద్య, ఉద్యోగ
సౌకర్యా లన్నీ ఎవరికి ?
కలిమి లేనివారికికాదు అని
కలవారికే, పలుకుబడికలవారికే అని
వేరే చెప్పాలా ?

పరిశ్రమలు, ప్రాజెక్టులు
రోడ్లు, రైళ్ళు, విమానాలు
ప్రజల డబ్బుతో ప్రభుత్వం అమలుపరిచే
పథకాల వల్ల లాభం ఎవరికి ? ఎవరికి ?

పైవారిని చూడగలిగే వారికి
తెలివిగా వలలువేసే వారికి
దేశంకోసం అంటూ
సొంతవ్యాపారం చేసుకునే వారికి
అని వేరే—వేరే చెప్పాలా ?

అయితే, ప్రజలు గొర్రెలు కారని
పాలకులు బధిరాంధులు కారని
శ్రీరంగనీతులు చెప్పే అవినీతులు
తెలుసుకుంటారా ఎప్పటి కైనా ?

# 40. స్నేహితం

స్నేహితులు రకరకాలు
పరిశీలించి చూస్తే.
ప్రేమ మాత్రం ఉండవలసిన స్నేహంలో
స్వార్థం కూడా రకరకాలు తరచిచూస్తే.

స్వలాభం ప్రధానం ఒక తెగకు
సర్వపరిత్యాగం మరొక తెగకు.
ప్రాణ మిస్తారు కొందరు స్నేహితులు
ప్రాణం తీస్తారు కొందరు స్నేహితులు.

అక్కర తీరేదాకా చక్కటి స్నేహితులు కొందరు
అక్కర ఉన్నప్పుడే అగుపించే స్నేహితులు కొందరు.

సహాయం చేయడానికి చేస్తారు కొందరు స్నేహం
సహాయం పొందడానికి చేస్తారు ఎందరో స్నేహం.

ఏరుదాటి తెప్ప కాలుస్తారు కొందరు,
నడియేటిలో మునిగిపోతుంటే
తెప్పలాగ వస్తారు కొందరు!

రాజకీయాల కోసం స్నేహం
రమణీమణుల కోసం స్నేహం
దొంగవ్యాపారానికి స్నేహం
తాగి తందానా లాడడానికి
పేకాట లాడడానికి
పందాలు వేయడానికి
చేస్తారు స్నేహం.

స్నేహంలేని జీవితం
ఎడారిలో మొక్కలాంటిది,
చమురులేని దీపం లాంటిది.
స్నేహితులు కావా లంటే
మనం కావాలి స్నేహితులం.

•

# 41. ఎవరా చిన్నది?

ఎవరో ఆ చిన్నది
ఎంతో అందాన్ని
తన పేలికల్లో
దాచుకున్నది !

వెన్నెల లా గున్నది
ఎండలో పోతున్నది
పూవు లా గున్నది
పూరిగుడిసెలో ఉంటున్నది !

చిగురు లాంటి చేతులతో
చాకిరీ చేస్తున్నది ,
బంతిపువ్వులాంటి తల మీద
బరువు తట్టలు మోస్తున్నది !

గులాబీల వంటి చెక్కిళ్ళు
చిలకముక్కులాంటి పెదాలు
ఉడికి వాడి పోతున్నవి
ఉసూరు మనే ఆమె ఆకలి మంటల్లో !

చింతలతో వంతలతో
చిక్కిపోతున్న అందాల కన్నెది—
ఎవరో ఆ చిన్నది ?
అనుమానం ఎందుకు ?
ఆమె పేరు పేదరికం !
ఆమే దారిద్ర్యం !

# 42. కోపం

కోపం ఆవేశంతో మొదలు,
పరితాపంతో అంతం.

కోపం ఒక మానసిక ప్రవృత్తి,
కోరిన పని కాకుంటే
అనుకున్నది ఇంకోలా జరిగితే
కోపం వస్తుంది.

ఎవరైనా నిందిస్తే–
ఒక పని తాను చేయలేననిపిస్తే–
తనకన్న చిన్నవాడనుకున్న వాడు
తనకంటే గొప్ప పని ఏదైనా చేస్తే–
కోపం సుడిగుండం లా
గుండెల్లో తిరుగుతుంది!

నవరసాల్లో బలహీనమైంది కోపం.
అది అగ్గి లాంటిది
అందులో వేడి తప్ప వెలుతురు లేదు.
కోపం మనిషిని కాల్చివేస్తుంది
కోపం కొంప లంటిస్తుంది.
చీటికి మాటికి కోపం
జీవితాన్ని బూడిద చేస్తుంది.
కోతి నుంచి మనిషి పుట్టాడని
కోపం ఋజువు చేస్తుంది.

కోపంతో పని చెయ్య బూనడం
తుఫానులో సముద్రంలోకి దిగడం.
ఒళ్ళు గుర్తుండదు,
పళ్ళు కొరకడం తప్ప
ఫలం ఉండదు, ఫలితం ఉండదు.

''తన కోపమె తన శత్రు'' వని
అన్న కవి మనందరికీ అన్న కవి!
అంతకన్నా ఎక్కువ నేనేమీ అనడం లేదు.

కోపం మనిషికి దేవుడిచ్చిన శాపం,
కోపం లేని మనిషి ఆ దేవుడి మరో రూపం.

# 43. పుట్టడం ఎందుకు ?

మనిషి పుట్టడం
గిట్టడాని కేనా ?
చదువు, ఉద్యోగం, జీతం
పొట్ట, బట్ట, చిట్టా—అంతా అందుకేనా ?

పుట్టడం గిట్టడం కోసమే అయితే
చెట్టు పుట్టదా ? పెరగదా ? గిట్టదా ?
ఉద్యోగం ఉదరపోషణకే అయితే
కంద మూలాలతో కడుపు నిండదా ?
అధికారం ఆకలి తీర్చుకోడానికే అయితే
ఆకు లలములతో ఆకలి బాధ తీరదా ?

అయితే - ఎందుకు ?
మనిషి పుట్టడం మ రెందుకు ?

ఎందుకా ?
చల్ల కొచ్చి ముంత దాచడం దేనికి ?
సూచించడం కంటే సూటిగా చెప్పడమే మంచిది—

పుట్టేది పురుషార్థం కోసం
బ్రతికేది పరమార్థం కోసం
పొట్ట నింపేది ప్రాణం నిలి పేటందుకు,
ప్రాణం ఒక మంచిపని చేసే టందుకు !

మంచిపని చెయ్యడానికి
ఉద్యోగం ఒక సాధనం !
ఏమి టా మంచి పని ?
ఎందుకా మంచి పని ?

కష్టాల్లోవున్నవారి కన్నీరు తుడవడం !
బాధల్లో వున్నవారి భారం తగ్గించడం !
మునిగిపోతున్న వారికి చేయి అందించడం !
ఆకలితో మాడుతున్న వారికి అన్నం పెట్టడం !

ఈ మానవసేవే మాధవసేవ !
నీ జీవిత సాఫల్యానికి చక్కని త్రోవ !
నీ ఉద్యోగం ఉద్దేశం అదే !
నీ అధికారం ఆదర్శం అదే !

పుట్టడం అందుకే !
పురుషార్థం సాధించే టందుకు !

# 44. అరువు కళ్ళు

కళ్లు లేని వాళ్లు చూడలేరు—
కాళ్ళు లేని వాళ్లు నడవలేరు—
అనేది పాతకాలం మాట.

ఈ నాడు మాత్రం
చూపుకు మారుచూపుగా
కనిపెట్టారు కళ్లజోడు !

కళ్ళకు వచ్చిన లోపాన్ని సరిదిద్ది
కనుపింప జేస్తాయి కళ్ళద్దాలు
అన్నిటినీ మునుపటి లాగే !

దేవు డిచ్చినవి అసలు కళ్లు
మానవు డిచ్చినవి అరువు కళ్లు.

అసలు కళ్ళు పని మానుకొన్నప్పుడు
అరువు కళ్లు పనిలో ప్రవేశిస్తాయి !
అనిపిస్తాయి కూడ—
అసలు కళ్ల కంటే
అరువుకళ్లే మిన్న అని !

# 45. ఆరు గురు మిత్రులు

బాలలే భారతానికి
భవిష్యత్తు వెలుగులు,
కలలు అవే కన్నాడు
చాచా నెహ్రూ.
కనుక –
బాలల కర్తవ్యం
మంచిగా విద్యలు నేర్వడం,
మనుషులుగా తయారు కావడం.

దిద్దాలి పిల్లలు
అవసరమైతే
పెద్దలనైనా
తమ క్రమశిక్షణతో.
నడిపించాలి
సమాజాన్ని
అభివృద్ధి

పథంలో.
అందుకు కావాలి
ఆర్గురు మిత్రులు.

వారే —
ఏమిటి ?
ఎవరు ?
ఎందుకు ?
ఎప్పుడు ?
ఎక్కడ ?
ఎలాగ? — అనేవారు.

అనాది నుంచీ
అందించబడుతున్న వాటి నన్నిటినీ
ఆచరించ వలసిన
అవసరం లేదు నేడు.
కాలదోషం పట్టిన వాటిని గుర్తించి
కడకు నెట్టేసుకొంటూ పోవాలి.

అందుకు —
వినాలి
చూడాలి

ఆలోచించాలి
ఆచరించాలి.

అందుకు ఉపకరిస్తారు —
మన ఈ ఆర్గురు మిత్రులూ !
తప్పక చేస్తారు సహాయం —
అడిగితే !
చెవి యొగ్గి వింటే !

పెద్దలు చూస్తారు
పిల్లల అవసరాలను
రంగు కళ్ళజోళ్ళతో!
అనుకుంటారు —
బాలల అవసరం
తమకే బాగా తెలుసు నని !
బాలల పేరుతో
అనుభవిస్తారు
అన్ని సదుపాయాలూ తామే
చలన చిత్రాలు —
బాల సాహిత్యం -
వింతలు —
వినోదాలు !

అందుకనే అంటాను నేను –
పిల్లల అవసరాల్లో, కార్యక్రమాల్లో
పిల్లలకే ఉండాలి కొంత జోక్యం అని !
పిల్లలు చేసే వన్నీ
అల్లర్లు కావనీ చెప్తాను ఇంకోసారి !

బాలలూ !
మీరు ఏమి చేయవలసినా
అడగండి తప్పకుండా
మీ ఆర్గురు మిత్రులనూ–
ఏమిటి ?
ఎవరు ?
ఎందుకు ?
ఎక్కడ ?
ఎప్పుడు ?
ఎలాగ ? – లను !

వస్తుంది సమాధానం
ఆలోచిస్తే మనస్సులోకి,
వింటే చెవులలోకి,
చూస్తే కన్నులలోకి !

# 46. కరణాలు

అంటారు—
"ఊళ్లో తగాదాలు ఉండాలి,
ఉండాలంటే కరణాలు అధికారంలో" అని !

పోరంబోకుల సాగులు
పంచాయతీ ఎన్నికలు
ఓటర్ల జాబితాల తయార్లు
జనన మరణ లెక్కలు
ప్రొక్యూరుమెంటు అంచనాలు
సర్వేరాళ్ల పాతడాలు
వాటిని తీయడాలు—
ఇలా ఉన్నాయి కావలసినన్ని
ఉపాధి కల్పించడానికి,
తగాదాలు కల్పించి
తీర్చడానికి !

అన్నిటినీ మించినవి
ఖూనీకేసుల రిపోర్టులు
ఫోర్జరీల ఫిర్యాదులు

పొలాల గట్ల మార్పిళ్లు
పెళ్లిళ్ల కట్నాల కుదిరింపులు
మళ్లీ అడిగితే పెళ్లిళ్ల తెగతెంపులు !
ఇంకా—
పార్టీలను పెంచడం
ద్వేషాలను పోషించడం !

ఇవన్నీ గ్రామాలకు
పుట్టుకతో వచ్చిన సుగుణాలే అయినా,
అంటారు కిట్టని వాళ్లు—
"కరణం లేని గ్రామం
కలహం లేని కొంప''అని !
అన్నిట్లోనూ కరణానికి
అంతో ఇంతో జోక్యం ఉన్నట్లు !

అన్నిటికీ వుంటాయి కారణాలు.
అయినా, పాపం నిందిస్తారు కరణాల్నే !
ఎవరెన్ని అనుకున్నా—
ఊరు మీద ఊరు పడ్డా
కరణం మీద కాసు పడదుగా ?
అందు కని
అంత ఫర్వాలేదు !

# 47. ఒకరికి - మరొకరికి

ఒకరికి ఆకలి—
తినుటకు వుండదు తిండి.
మరొకరికి అజీర్తి—
వుంటుంది తినలేనంత.

ఒకరికి దప్పిక—
వుండదు మంచినీరైనా.

మరొకరికి దాహమే తెలియదు—
వుంటుంది వలసినంత పానీయం.

ఒకరికి కావాలి—
తల దాచు కోను చోటు.
మరొకరికి వుంటాయి—
మేడలు మిద్దెలు ఎన్నో,
వుండడానికి ఎవరూ లేకున్నా !

ఒకరికి చింపిరి పాతైనా
వుండదు మాన రక్షణకు.
మరొకరికి విలువైన వలువ లున్నా
కావాలి ''మినీ డ్రెస్'' మోకాళ్ల పైకి.

ఒకరికి అవసరం—
మరొకరికి అనవసరం.
ఒకరికి దుఃఖం—
మరొకరికి సుఖం !
ఈ ఒకరితో—
ఆ మరొకరు
పాలు పంచుకో గలిగితే
ప్రపంచ మెంత హాయి !

# 48. స్త్రీ

అందంగల స్త్రీ ఒక ఆభరణం,
సౌశీల్యంగల స్త్రీ ఒక సౌభాగ్యం.

స్త్రీ హృదయం చంద్రుడి లాగే
ఎప్పుడూ మారుతుం దంటారు,
అయితే, అందులో నీడలా
పురుషుడు వుండనే వుంటాడు.

భూలోకానికి స్త్రీలు
స్వర్గానికి తారలు,
సంగీతానికి సరిగమలు.

స్త్రీ గాలికి వంగుతుంది గడ్డిపోచలా,
కాని తుఫానుకు కూడా విరగని మహా చేవ!

స్త్రీని పురుషుడిలో నుంచి
తీశాడు దేవు డంటారు,
పైనుంచో క్రిందనుంచో కాక
ప్రక్కనుంచి తీశాడు—
వుండడానికి సమానంగా!
హృదయం దగ్గరనుంచి తీశాడు
ప్రేమకు చోటివ్వడానికి!

స్త్రీలు ప్రపంచాన్ని ప్రదర్శించే లలితకళలు,
విజ్ఞానాన్ని అందించే పుస్తకాలు!

అంటారు—
అందం ఆడువారికి తెస్తుంది గర్వం,
సుగుణం వారికి అందిస్తుంది ఆరాధన,
వినయం వారికి ఇస్తుంది దివ్యత్వం—అని!

యుద్ధాలు లేని దేశాల లాగే
బాధలు లేని స్త్రీకి
వుండదు అంటారు చరిత్ర!

# 49. ఎరువు సొమ్ము

హెచ్చులకు,
హోదాలకు,
అరువు చేస్తారు !
ఎరువు తెస్తారు !

బంధువులు వస్తే
సోఫాలు,
స్నేహితులొస్తే
టీపార్టీలు,
''ఊ'' అంటే
పండుగలు,
'ఆ' అంటే
పుట్టిన రోజులు !

పెళ్లిళ్ళకు
విలువైన నగలు,
పేరంటాలకు
పసందైన చీరలు,
అంతులేని మోజు
అరువు సొమ్ము పైన!
కనలేరు—
ఎరువు సొమ్ముకున్న బరువు!

దొంగల వల్ల
దోపిడీల వల్ల
నీటి వల్ల
నిప్పు వల్ల
మతిమరుపు వల్ల
మన అవివేకం వల్ల
మన సొమ్ము పోతే
పోయిందిలే అనుకుంటాం!
మరి ఎరువు సొమ్ము పోతే?
ఎందుకో ఈ తలకు మించిన బరువులు,
మోజులు, మోహాలు!

# 50. పూ జ లు

దేవుడి పేరుతో మాన్యాలు,
అనుభవించేది పూజార్లు.
నైవేద్యం దేవునిదైతే
ప్రసాదం పురోహితుడిది.

చేస్తాము మోసం
దేవుడిని కూడా,
ఇస్తాము లంచం
పనులకు విలువకట్టి !

మొక్కు కుంటాం
రేట్లు ప్రకారం –
పరీక్ష ఫీసుకు ఇంత,
రేసుల గెలుపుకు అంత,
అమ్మాయి పెళ్లికి –
అవ్వ ఆరోగ్యానికి –
పక్కవాడి పతనానికి –
అకాల ప్రమోషన్లకు --
ఆటల్లో పోటీల గెలుపుకు --
కాంట్రాక్టు పర్మిట్లకు –
రకరకాల పనులకు
రకరకాల రేట్లు !

అనుకోరాదు రేట్ల 'జీ. వో.' ఒకటి
ఆయన పాస్ చేసిపారేశా డని !

అయితే—
మొక్కుబడిదార్ల ఎల్.డి.సి.ల నోటుపైన
వేసివుండవచ్చు 'ఎస్' అనే ఓ గుడ్డి ఆర్డరు!

దేవుడు గుళ్లోనే వున్నాడా ?
ఆ గబ్బిలాల గిడ్డంగిలో ?
ఆ అయ్యవార్ల చెమట వాసనలో ?

గుళ్లో విందులు పెట్టి
గొళ్లెం వేస్తారు తలుపులు ..
ఆ దేవుడు తినే తిండి
ఈ నరులు చూడరాదని!

ఈ భూలోక నాటకం
ఆ దేవుడే నడిపిస్తుంటే
కంచే చేను మేసినట్టు కాదా?

ఇక్కడ జరిగే దుర్మార్గాలను
చూస్తున్నాడా దేవుడు ?
పూజారులు పెట్టే
పులిహోర భుజించి
పానకం సేవించి

✓ కన్నులు మూసుకు నిద్రిస్తున్నాడా ?
ఉన్నాడా గుళ్లో దేవుడు ?
ఉంటే వూరుకుంటాడా
ఊళ్లో జరిగే అన్యాయాలను తిలకిస్తూ ?
తనకే జరిగే మోసాల్ని సహిస్తూ?

నిలువుదోపిడి పేరుతో
ఇస్తారు నాలుగు కాసులు –
వేలు ఖరీదు చేసే నగలన్నీ
ఇంటి వాళ్లకే పైసాల కమ్ముకొని !

కొట్టేది కుళ్లిన కొబ్బరికాయ
వాడేది ఎండిన తమల పాకులు
పుచ్చిన వక్క పలుకులు !
నిజంగా దేవుడు గుడ్డివాడా ?
దేవుడి కంట్లోనే ఇంత దుమ్మా ?

వస్తుందా మోక్షం మనిషికి
చెయ్యందే దేవుడు మెచ్చే కార్యాలు ?
పోతుందా గుళ్లో చీకటి
పెట్టందే విజ్ఞాన దీపాలు ?

## 51. ఇటుక

ఇటుకకు శరీరం ఇసుకా-మట్టీ !
పోస్తారు ప్రాణం ఆవంలో కాల్చి !

ఇంటికి మూలం ఇటుక
ఇటుక లేక యిల్లే లేదు !

ఇటుకను కనిపెట్టిన వాడు
ఇంద్రుణ్నే మించిన వాడు!

ఆదిమవాసి నుంచి
ఆధునిక మానవుడి వరకు
జరిగిన ప్రగతి నంతా
సరిగ్గా పరిశీలిస్తే--
ఇవ్వాలి ఇటుకకు
విలువలేని స్థానం చరిత్రలో.

ఇటుక లేకుండా
ఇంద్రుని సభ కూడ వుండదు,
ఇటుకలోనే వుంది
కిటుకు మానవ నాగరికతకు!

ఇటుక లేక ఇల్లే లేదు,
ఇల్లు లేక ఇహ సౌఖ్యం లేదు,
ఇటుక—
ఇంటికి పునాది!
ఇహ సౌఖ్యానికి ఆది!

# 52. విమానయానం

ఆకాశంలో
ఆ కారు మేఘాలకే అందని దూరంలో
అలా అలా ఎగిరిపోయింది
బోయింగ్ విమానం—సెవెన్-త్రి-సెవెన్ !

నింగి నుంచి క్రిందికి తొంగిచూస్తే
అంతా ఒక వింతైన మరపురాని స్వప్నం!
కన్నుల పండుగ !

మిల మిల మెరిసే వెన్నెలలో
తళ తళ మెరిసే సెలయేరులు
మెలికలు తిరిగే తాచుపాముల్లా !

మేఘాల గుంపుల్లో
మెరుపు తీగలు వెదజల్లే వెలుగులు !

నగరాలు బొమ్మరిళ్ళుగా
రోడ్లు, రైళ్ళు ముగ్గులుగా,
విద్యుద్దీపాల వరుసలు
మణిమాలలుగా,
మేఘాలు కుప్పలు తిప్పలు
మంచు కొండలను మించివుండగా,
కొండలు గుట్టలుగా,
అడవులు పచ్చిక బయళ్ళుగా,
రస్తాలేని యీ మోటారుబండి ప్రయాణం

పట్టాలు లేని యీ రైలుబండి యాత్ర
కాదా వింతల్లో వింత ?
వినోదాల మాలలో మణిపూస ?
గంటకు నాలుగు వందల మైళ్ళ వేగం,
గమనమే తెలియదు !
ఘడియలో చేరుతాం గమ్యం !

అంతంలేని ఆకాశపు పెత్తుల్లో
అడ్డులేకుండా దూసుకు పోయింది విమానం !

అంతులేని ఇంత ప్రకృతి సౌందర్యం
అందుకో గలుగుతున్నాం ఆకాశం నుంచి !

స్వర్గం పైనెక్కడో వున్నదంటారు,
క్రింద వున్న స్వర్గాన్ని చూడగలం
పై నుంచి అంటాను నేను.
పై నుంచి స్వర్గాన్ని చూచి ఎవరో
వ్రాశారు తల క్రిందుగా అది క్రింద వున్నదని !
కాకుంటే
శూన్యంలో స్వర్గ మెలావుంటుంది ?

# 53. కలం

వాదించారు
వేదాంతులు
కలం గొప్పా ?
కత్తి గొప్పా ? అని !

కలానికీ, కత్తికీ కలయి కేది ?
కలం పని వ్రాయడం,
కత్తి పని కోయడం !
కలం కనిపెట్టినవాడు
ఎంతకైనా ఘనుడు !

కలం కదిలించింది జగాన్ని,
అందించింది మానవ చరిత్రను మనకు.

నాటినుంచి నేటివరకు
నిలచిన కథలకూ, కల్పనలకూ
కలమే కారణం !

కలం లేకుంటే
కాల చక్ర గమనం మారకపోవచ్చు కాని---
మన కందేది కాదు !

సీత ఎవరో - రాము డెవరో,
అశోకుడు - హర్షవర్ధనుడు
బుద్ధుడు - గాంధి
రైలు ప్రయాణం
ఆకాశయానం
తంతి-తపాలా
అవీ-ఇవీ-ఇంకా
అన్నీవుండేవి రూపురేఖలు లేకుండా
దిద్దకుంటే కలంతో ఆకారాలు,
పోయకుంటే సిరాతో ప్రాణాలు !
కత్తిది మరో కథ —
దానికి కూడా ప్రాణం పోసింది
కలమే కద !

# 45. చెప్పు

కాలికి చెప్పు అవసరం
కాలికి అది కవచం.

కళాకారుడు చేస్తాడు చెప్పులు కూడ
కాళ్లకు అందంగా
కన్నుల కింపుగా.

కొందరు వేస్తారు చెప్పులు అందానికి,
ఎందరో వేస్తారు అవసరానికి.
మరి కొందరు వేస్తారు శత్రువులపై కుప్పలుగా.
నాజూకు స్త్రీలు వేస్తారు
ఎత్తుమడమల చెప్పులు
పడబోతూ — తట్టుకుంటూ !

ఇంకా వున్నాయి చెప్పుల కనేక ఉపయోగాలు.
రైతులకు కిర్రుచెప్పులు
నాజూకు వాళ్ళకు జల్తారు చెప్పులు.

అవసరానికి వాడతారు,
వాడతారు ఆయుధాలుగా,
అయినా –
చూస్తారు చెప్పును నీచంగా !

ఎండల్లో – ముండ్ల కంపల్లో
చెప్పుల ఉపయోగం చెప్పాలా?
కాలిని నేలను కలిపే చెప్పు
చెప్పరానంత మేలు చేసే చెప్పు !
చెప్పు చేసిన పుణ్య మేమో గాని –
వినలే నప్పుడు ఉపన్యాసాలు
ఎగురుతాయి వేదికల పైకి,
గొప్పవారి మెడల్లో పడతాయి
బంతిపూల మాలల్లా !

తప్పు చేసినవారి నుద్దేశించి
కొట్టాలి చెప్పుతో అన్నప్పుడు
చెప్పు సంతోషిస్తుందో, సిగ్గుపడుతుందో
చెప్పలేం కాని–
చెప్పును మాత్రం చూస్తారు నీచంగా
తమ నీచత్వాలను దాని కింద దాచుకొంటూ !

## 55. ఇల్లు

ఇల్లు నివాసానికి ఇంత చోటే అయినా
ఇంటికి అర్థం వుంది యింకెంతైనా.

ఇల్లు లేని వాడు తల్లి లేని వాడే.
పొద్దు గూకే వేళకు పొద చేరాలి మృగం
సాయంత్రానికి గూటికి చేరాలి పక్షి

రాత్రికి తలదాచుకోవాలి రాజైనా, ఏదో ఒక చోట.
ఆడుకునే పిల్లలకు విసుగో, అలసటో వస్తే
"వెళ్ళుతాం ఇక ఇంటికి" — అంటారు.

పొలానికి వెళ్ళినా
పోరుకు వెళ్ళినా
విహారాలకు పోయినా
విదేశాలకు పోయినా
ఇంటికి వెళ్ళాలని తొందర చేస్తాం,
ఇల్లాలిని కలవాలని ఎదురు చూస్తాం.
శాంతి సుఖాలకు ఇల్లు నిలయం
సతీ సుతులకు ఆలయం.

ఇల్లు బాధలను తొలగించే చల్లని వెన్నెల,
తల్లితో సమానమైన మరో తల్లి.

ఒప్పుకోను నేను—
ఇంటిలోని పోరు ఇంతింత కా దనే మాట.
బయటి పోరు కంటె అది
బరు వేమీ కాదు
పోరులేని ఇల్లు
పొగలేని నిప్పు !

# 56. విధి

అనుకుంటాం ఏదో అవుతుంది—అని
కాని, అయ్యేది మరొకటి.

అంతా అనుకున్నట్టే అయితే
కాదా అంతా భూతలస్వర్గం ?

అవసరమే ఉండదప్పుడు
మానవ కృషికి.

కలసివస్తే కార్యసాధన,
లేకుంటే కర్మఫలితం!
అనుకుంటూ –
అంతటితో ఆగిపోతే
అవుతామా మానవులం ?
మారుతుందా మన సమాజం ?

అంటారు–
కావలసింది అవుతుందీ
విధి విలాసం వీలుగాదు మార్చడానికీ–అని.
ఆచరించేదీ, అనుభవించేదీ మనం,
అపనిందలు వేసేది అగుపించని విధిపైన.
అసమర్థత మనదైతే
ఆపాదించేది అదృష్టానికి!
వింతగా వుంటుంది విధిని నిందించడం !
ఆడరాక మద్దెల ఓ టనడం !

# 57. పేరు

పేరులో ఏముంది పెన్నిధి ?

పరిచయానికి ముఖం లాగే
పిలవడానికి పేరు.

మారిస్తే రోజా పువ్వుకు పేరు
మారుతుందా వాసన !

అయినా—
పేరులో వుంది పెద్ద విలువ.

మంచి పేరు కావాలంటే
మనుషులు పడాలి శ్రమ,

వస్తుంది చెడ్డ పేరు
వద్దన్నా సులభంగా !

వెలుగు నిస్తుంది మంచి పేరు
మెరుపు తీగలా.

చేరుస్తాము పేర్లను
మంచి పనులతో—
చెడ్డ పనులతో—
కర్ణుని దానంతో,
కుంభకర్ణుని నిద్రతో,
హరిశ్చంద్రుని సత్యంతో,
సావిత్రిని పాతివ్రత్యంతో.

పెద్ద లన్నారు—
మనిషికి ధనం పోతే దారిద్ర్యం చుట్టుకోదు కాని,
మంచిపేరు పోతే మనిషికి అంతా నష్టమే—అని.

గుణంలేని మనిషి
గణింప బడడు,
మంచిపేరు మనిషికి మకుటం.

# 58. చాడీలు

దుష్ప్రచారాలు చేసేవారు–
అపనిందలు మోపేవారు–
అమాయకుల ప్రాణాలు తీసేవారు !

చాడీలకు ఋజువు ఉండవు.
అయినా–తీస్తాయి కొంపలు,
కోస్తాయి గొంతులు.

వినేవారు లేకుంటే
చెప్పేవారే వుండరు చాడీలు.

చాడీలు వినాలని,
అసూయాపరులకు ఆసక్తి.
చాడీలు వినే చెవులు
శ్మశాన వాటికలే అవుతాయి
ఇతరుల మంచి పేరు ప్రతిష్ఠలకు.

కుటిలాత్ముల కంటిరెప్ప ఆడింపులలో
మోసగాళ్ల తలవూపులలో
కుత్సితుల విషపు చిరునవ్వులలో
త్రవ్వుతారు పూడ్చలేని
అనుమానపు అఘాతాలను.

చాడీలు చెప్పేకంటే
మనకు నచ్చని వ్యక్తిని
మరిచి పోవడమే మంచిది కాదా?

అనుకుంటారు చాడీకోరులు—
తమ మంచితనానికి రుజువు చాడీలే నని.
వినేవారు ఇస్తారు విలువ
నమ్మరాని మాటలకే,
అందులో మసాలా
ఘాటుగా వుంటుంది గనుక.

చాడీల వల్ల అనర్ధాలు చెప్పలేనన్ని.
స్నేహితుల మధ్య విరోధం!
పచ్చటి కాపురాలు పాడుకావడం!

చాడీలు—
చెప్పేవారికి అదొక సరదా
వినేవారి కదొక వినోదం.

చెప్తుతారు చాడీలు
కాలాన్ని చంపడానికి కొందరు.
కాని చాడీలు చంపుతాయి
అవి తగిలే చాల మందిని.

మంచి గుణాలు
కలుస్తాయి మట్టిలో పుట్టిన చోటే.
చెడు గుణాలు
ఎగురుతాయి రెక్కలు కుట్టుకొని ఎక్కడికైనా,
అపనింద నడుస్తుంది చక్రాలపైన
ఆ బండికి వేస్తాయి అన్నిచేతులూ కందెన.

దీనికి మందు
చెప్పేవాడి నాలుక చీల్చడం,
వినేవాడి చెవుల్లో
సీసం కరిగించి పోయడం.

# 59. అదృష్టం - పని

దృష్టికి అందనిది అదృష్టం.
అయితే అంటారు మంచినే అదృష్టం – అని,
చెడు జరిగితే దురదృష్టం – అని.

అదృష్ట మంటూ
లేనే లేదంటాను నేను.

శ్రమించి –
ఫలితం చేతి కందే వరకూ
సిద్ధంగా వేచివుండడానికే
అదృష్ట మని ముద్దు పేరు.

గొప్పవారి అదృష్టం
కష్టాలను గెలిచే శక్తి కలిగి వుండడమే.

క్రమం తప్పని కార్యశూరత కలవాడు
కాడు దురదృష్టం పాలు.

కారణాలు లేకుండా
సాధించలేరు కార్యాలు ఎవరూ.
దురదృష్ట మనేది
నూటికి తొంభై పాళ్ళు
సుఖసంతోషాలను ముందు –
విధి నిర్వహణను వెనుక –
ఉంచే వారికే.

అదృష్టం ఎదురు చూస్తుంది
అవకాశాల ''పేకెట్'' తపాలా కై,
శ్రమ పాటుపడి
పొందుతుంది ఫలితాన్ని.

అదృష్టం పడక దిగకుండా
బెడ్ కాఫీ కెదురు చూస్తే,
శ్రమ ఆరుగంటలకే నిద్రలేచి
సిద్ధం చేసుకొంటుంది కావలసిన వన్నీ.

అదృష్టం అవకాశంపై ఆధారపడితే
శ్రమకు క్రమశిక్షణే శరణ్యం.
అదృష్టవంతుని ఏటిలో తోస్తే
బయటికి వస్తాడా నిజంగానే నోటిలో చేపతో?

అదృష్టం తట్టుతుంది అందరి తలుపులు
జీవితంలో ఒక్కసారైనా,
పరిశ్రమ పడుకొని తలుపు తీయకుంటే –
తిరిగి పోతుంది,
మరల రాక పోవచ్చు.

# 60. భా ర్య

పిల్లల్ని కనడం, పెంచడం
భార్య బాధ్యత
కా దనలే రెవరూ.

వంట పని—ఇంటి పని మాత్రం
చేయవచ్చు ఎవరైనా !
దానికి భార్య, భర్త
ఆడ, మగ
తేడా అక్కర లేదు.

అయితే —
ఇంటి చాకిరి స్త్రీ చేయడం
అయింది అలవాటు.
మార్చుకోవాలి అలవాట్లు
అభివృద్ధిని కోరి.
అన్నిపనులూ చేయాలి
ఆడా — మగా -- తేడా లేకుండా.

అలనాడు చేశారు స్త్రీలను బానిసలుగా
ఈనాడు ఏదీ ఆ అవసరం?
అన్నిటికీ స్త్రీ ముందే — ఆలోచనలో,
అన్నీ తలక్రిందే — ఆచరణలో !

వ్రాతల్లో —
స్త్రీ పురుషులు
గౌరీ శంకరులు

సీతా రాములు
తల్లి తండ్రులు.

చేతల్లో –
మగవాడు ఆడది
శివుడు పార్వతి
రాముడు జానకి
నాన్న – అమ్మ!

చెప్పడంలో
ఆదిశక్తి
పరాశక్తి.

చేయడంలో
అబల
అవసరమైన బానిస.

జంటలో ఒకరు
మంటిలో కలిస్తే –
మగవాడికి మళ్ళీ పెళ్ళి!
ఆడదానికి ముండమోపితనం!

ఆడదాని జన్మ హక్కు
ఏడుపే అన్నట్టు —
ఏడిచే మగవాడిని
నవ్వే ఆడదానిని
నమ్మరా దట !

ఆడ – మగ
అర్థనారీశ్వరు లైతే,
తేలదా వివాదం
పడక గదిలో ?
బయటకి లాగే
ప్రమాద మెందుకు ?
పెట్టారు పూర్వులు
ఈ చెత్త భేదాలు
తెలిసో తెలయకో !
మగువకు పరదా!
మగడికి సరదా !

పంచెకట్టు – పమిటకొంగు
పై కండువా – పసుపు, కుంకమ
రూపురేఖలు దిద్దేందుకా ?
స్త్రీ పురుష విభేదాలు చాటేందుకా ?

# 61. వెల్లుల్లి శాస్త్రి

విన్నారా వెల్లుల్లి శాస్త్రి కథ ?
ఇంటరెస్టుగా వుంటుంది వింటే !

చెప్పేవాడు శాస్త్రి
హరికథా కాలక్షేపాలలో—
వెల్లుల్లి తినరా దని,
విధవలు తింటే విరహబాధ లని,
సధవలు తింటే రాజసగుణా లని,
యువకులు తింటే
సెక్సు భావాలు రేకెత్తుతా యని !

ఈ సద్బోధ విని విని విని
వండింది ఒకనాడు శాస్త్రి భార్య
వెల్లుల్లి లేని
సాత్వికపు వంట !
మింగలేకపోయాడు శాస్త్రి ఒక్క మెతుకు కూడ,
అర్థంకాక అడిగాడు భార్యను.

చెప్పింది ఆమె—

"విన్నాను మీ ఉద్బోధ
వండాను వెల్లుల్లి లేకుండా,
ఇక మనం సత్వ గుణ సంపన్నులం,
తరించింది మన జీవితం నేడు"అని !

పెల్లుబికింది కోపం
మన వెల్లుల్లి శాస్త్రికి !
ఇచ్చాడు ఆజ్ఞ భార్యకు —
''పిచ్చిదానా !
చెప్పే ఉపన్యాసం లోకులకు.
చేసే ఆచారం మనకు.
ఎవడు చెప్పాడు చేయ మని వంట
వెలుల్లి లేకుండా మన యింట ?
ఈ రుచిలేని భోజనం తిని
ఎలా బ్రతుకుతా మంట ?
ఇక ముం దెప్పుడూ చెయ్యకు
బైట నేను చెప్పినట్టు !
ఉద్బోధలు ఇతరులకు
ఉల్లిపాయలు మనకు" అంటూ !

విన్నారా ఈ వెల్లుల్లి శాస్త్రి కధ?
ఇక ఎలా తీరుతుంది ప్రజల నైతిక వ్యధ ?

# 62. జనరేషన్ గేప్

జనరేషన్‌కూ, జనరేషన్‌కూ ఒక ''గేప్'' ఉంది,
తరానికీ తరానికీ వంతెన కట్టవలసి ఉంది.
వృద్ధుడు ఒకప్పుడు యువకుడనీ
యువకుడు ఒకప్పుడు బాలుడనీ

మరచిపోవడమే
జనరేషన్ గేప్—

ఉపాధ్యాయుడు విద్యార్థిగా ఉన్నరోజులు
విద్యార్థి ఉపాధ్యాయుడైన రోజులు
రెండు గట్లుగా చీలిపోతుంటే
వాటి మధ్య నిలిచే కాల ప్రవాహమే
జనరేషన్ గేప్ —

అత్త కోడలుగా ఉన్న నాళ్ళకు
కోడలు అత్త అయిపోయిన నాళ్ళకు
మధ్య ఉన్న తేడాయే
జనరేషన్ గేప్—

వయసు వస్తున్న కుర్రవాళ్ళు
ప్రేమ కలాపాలలో తేలిపోతుంటే,
వయసు పోతున్న ముసలివాళ్ళు
వెర్రి వ్యాఖ్యానాలు చేయడమే
జనరేషన్ గేప్—

# 63. ఎవరికి నష్టం

కన్నుకు జబ్బుచేసినా
కాలుకు ముల్లు గుచ్చుకున్నా
కాదా బాధ—
శరీర మంతటికీ?
లేదా అవసరం
సత్వర వైద్యానికి?

సమాజంలో పేదరికం,
ప్రజల కడగండ్లు,
కాదా భరించరాని బాధ
సమాజ మంతటికీ !
లేదా అవసరం సత్వర పరిష్కారానికి ?

ప్రజా రాజ్యంలో
తమను తాము ఏలుకునే కథనం
ప్రజాస్వామ్యంలో
సమానంగా బ్రతికే విధానం
ప్రజల జన్మహక్కు కాదా ?

స్వార్థపరులు వినియోగించు కుంటారు
సమాజంలో అవకాశాలను
ప్రతి ఒక్కరూ ఓపినంతగా.

కొల్లగొట్టే టప్పుడు
దోపిడీ వాళ్ళలాగ
యథాయుక్తిగా

తట్టలతో, బుట్టలతో
బండ్లతో, లారీలతో
చేరవేసుకుంటారు శక్తికొలదీ.

వ్యాధి ముదిరితే
చిన్న చిన్న చికిత్సలు పనిచేయవు గనుక
కావాలి మేజర్ ఆపరేషనులు.

సమాజాన్ని చుట్టుకున్న జాడ్యాల నిర్మూలనకు
చాలవు చిన్న చిన్న సేవా చిట్కాలు,
తీసుకు రావాలి తీవ్రమైన మార్పులు.

కన్ను గుడ్డిదైతే
కాలు కుంటిదైతే
కష్ట మెవరికి ?
సమాజంలో కొందరు
ఆకలితో మాడుతుంటే--
వారి అవసరాలు తీర్చే టందుకు
అన్నీ అడ్డంకులే అయితే--
నష్టం ఎవరికి ?

# 64. కలక్టరు కడగండ్లు

అంటారు –
పెద్ద కలక్టరువా? అని !
కలక్టర్ల కడగండ్లు ఎన్నో
ఆ అనేవాళ్లకు తెలుసా అని ?

ప్రొద్దున్నే లేచి నప్పటి నుంచీ
నడిరాత్రి నిదురపోయే దాకా
తన కాయం

తన కాలం
తనది కాదని?

ఏ వూరు కాలిపోయినా
ఏ ఇల్లు కూలిపోయినా
తుపాను గాలి వీచినా
అంటువ్యాధులు లేచినా
పైరులు పండకున్నా
వానలు కురవకున్నా—

పశువులకు మేత లేకున్నా
మనుషులకు మంచినీటి కొరత తున్నా,
చెరువుల్లో చేపలు కరువైతే
అడవుల్లో చెట్లు తరుగైతే—

ఎరువులు దొరక్కపోయినా
కరంటు ఆగిపోయినా
పెంటకుప్పలు మూయకున్నా
మురికి కాలువలు తీయకున్నా—

కలత పడేవాడు కలక్టరే!
చర్యలు తీసుకోవలసింది కలక్టరే!

కల్లు సారా అంగళ్ళ వేలం పాటలు
అవి సేవించే వాళ్ళ కొట్లాటలు
సమ్మెలు—నిరాహార దీక్షలు
శాంతి భద్రతల సంరక్షణ-—

చౌకబియ్యపు దుకాణాల చెకింగులు,
అర్జీదార్ల ఆకలి మంటల
మహాభారతాల వల్లింపులు,
హరిజనులకు ఇళ్ళ స్థలాలు
గిరిజనులకు సంక్షేమ పధకాలు—

కాలేజీ సీట్ల గొడవలు
కరువు నివారణ రోడ్లు
కోళ్ళ పెంపకం
పాల పంపకం
పేద విద్యార్థుల వసతి గృహాలు—

పిల్లల పోషణ
స్త్రీల సంక్షేమం
కుటుంబ నియంత్రణ
ఆరోగ్య పధకాలు
అన్నీ కలెక్టరు దినచర్యలో
అత్యవసర మైన అంగాలే!

కాలే కడుపుతో
కారులో కాలుపెట్టే టప్పుడు కూడ—
కాలిపోయిన బ్రతుకులను
కన్నీటి గాథలను
వర్ణించే కడపటి పిటిషన్‌దార్ల గోడు!

జీతాలు ఇంకా ముట్టలే దని
రావలసిన ఇంక్రిమెంట్లు రాలే దని
బజారులో బియ్యంనూకలు లే వని
బస్సులు చాలటం లేదని—

పొలాలకు నీళ్ళు వదలడం లేదని
పెట్టుకున్న కాగితాలు కదలడం లేదని
ఉద్యోగాలు కావా లని
ఉపాధులు పోయా యని
ప్రజలు పెట్టే లక్ష మొరల మధ్య
కలెక్టరు జీవిత సౌఖ్యం వట్టి మిథ్య.

గుమస్తాలు పుటప్ చేసే
వాళ్ళ కిష్టమైన ఫైళ్ళ బస్తాలు
విరామంలేని టెలిఫోను మ్రోతలు
ప్రణాళికలు—పథకాలు—

పంచాయితీ సమితుల తగాదాలు
స్టాండింగ్ కమిటీల సిటింగులు
సిటింగ్ కమిటీల మీటింగులు
ప్రారంభోత్సవాలు
మంత్రుల రాకపోకలు,
వారికి వలసిన కార్యచర్యలు—
ఎన్నెన్నో విన్నపాలు
ఎన్నెన్నో వివాదాలు!

ఇదే కలక్టరు జీవితం!
ఆయనకు లేదు స్వగతం!

అయితే—
ప్రజల కష్టాలే తన కష్టాలుగా,
ప్రజల కోర్కెలు తీర్చే ప్రభుత్వ ప్రతినిధిగా,
భావించే కలక్టరుకు
ఈ తీరిక లేని పనులే
తీరం లేని ఆనందం ఇస్తాయి.
కళలూ, కవిత్వాలూ
ప్రజలలోనే అగుపిస్తాయి.
సంస్కృతిని కూడా పోషించినపుడే తనకు
శాంతి సుఖాలు లభిస్తాయి.

# 65. అదీ - ఇదీ

ఆ దేదో అంతా ఇదిగా వుంటుంది
ఇ దేదో అంతా అదిగా వుంటుంది.

నవ్విస్తే ఇదిగా వుంటుంది
కవ్విస్తే అదిగా వుంటుంది.

అది చేస్తే ఇది గాను
ఇది చేస్తే అద గాను
అంతా ఒక ఇది గాను
ఎంతో అది గాను
ఇది అది గాను
అది ఇది గాను — వుంటుంది.

దానికి దీనికి భేదం ?
దీనికి దానికి అర్థం ?
అది అదే — ఇది
ఇది ఇదే — అది.

అది లేకుండా ఇది
ఇది లేకుండా అది
వుంటుందా ?

అది ఇది అన్యోన్యం
ఇది అది అనురాగం
ఇదే అది
అదే ఇది.

అది లేకుండా ఇది లేదు
ఇది లేకుండా అది అసలే లేదు.
దానికి ఇది ఎంత దూరమో
దీనికి అది అంత దూరమే.

అది అనిపించనపుడు
ఇది అగుపిస్తుంది.
ఇది కనిపించనపుడు
అది అనిపిస్తుంది.

అది ఇదిగా వున్నప్పుడు
ఇది అదిగా వుంటుంది.
ఇది అదిగా వున్నప్పుడు
అది ఇదిగా వుంటుంది.

అ దేదో అంతా ఇది !
ఇ దేదో అంతా అది !